# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి. 11 ] జూన్_1967 [ సంచిక: 8

జ్యేష్ఠ-ఆషాఢ 1889 శా.శ

ప్రధాన సంపాదకులు

బి. ఆర్. కె. శాస్త్రి, ఏం.ఎ., ఐ.ఎ.ఎస్

సంపాదకులు

చదువుల రంగనాథం

ముఖచిత్రం: సౌభాగ్యానికి సప్తాక్షరి

ఫొటో: వై. రామారావు

రెండవ చిత్రం: వసిష్ఠనదిపై రోడ్డువంతెన

మూడవ చిత్రం: గౌతమీనదిపై రోడ్డువంతెన

ఫొటోలు : సయిదుద్దీన్

నాలుగవ చిత్రం: వరుసలు

ఫొటో : సీతు

* ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు

## ఈ సంచికలో



# బీహారు సహాయకనిధి

—ముఖ్యమంత్రి విజ్ఞప్తి

బీహారులో కరువుకాటక పరిస్థితులు చాలా తీవ్రస్థాయిలో వున్నాయి. వేలాది, లక్షలాది ప్రజలకు తినతిండిలేని పరిస్థితి ఏర్పడింది. శ్రీ జయప్రకాశ్ నారాయణ్ అధ్యక్షతన బీహారు సహాయకనిధి సంఘం ఒకటి ఏర్పడి; క్షామానికిగురిఅయిన బీహారు ప్రజలనిమిత్తం నిధులను, ఆహారధాన్యాలను, మందులను సేకరిస్తూ ఎంతగానో సేవచేస్తున్నది. ఇటీవల జయప్రకాశ్ నారాయణ్ హైదరాబాదు వచ్చినప్పుడు ఆంధ్ర ప్రదేశ్‌లో సహాయక నిధుల్ని సేకరించే నిమిత్తం యిక్కడొక శాఖను ఏర్పాటు చేశారు. ఈ నిధికి ఉదారంగా విరాళాలు యివ్వవలసిందిగా ఆంధ్ర ప్రదేశ్ లోని ప్రతిపౌరునికి విజ్ఞప్తి చేస్తున్నాను. క్లిష్టపరిస్థితుల్లో మునిగివున్న బీహారుకు సహాయపడదామని దేశమంతా ముందుకు వచ్చింది. మనం కూడా యీ సహాయక కృషిలో వెనుకబడకూడదు.

---

విరాళాలను:— "ఆంధ్ర ప్రదేశ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్ కార్యాలయం, శంకర్ భవన్, నిజాంషుగర్ ఫ్యాక్టరీ బిల్డింగ్, ఫతేమైదాన్ రోడ్డు, హైదరాబాదు" చిరునామాకు పంపించండి. మీరు యిచ్చేవిరాళాలు ఆదాయపు పన్నునుండి మినహాయించబడతాయి. మీరు పంపే నగదు, వస్తువులపై తపాలాఛార్జీలు, రైలుఛార్జీలు, విమానఛార్జీలలో రాయితీ సౌకర్యంకూడా కల్పించ బడుతుంది.

# మన నూతన రాష్ట్రపతి

## డాక్టర్ జాకిర్ హుస్సేన్

మన సజాతి భవిష్యత్తును తీర్చిదిద్దిన రాజనీతిజ్ఞులను, ఆర్థిక వేత్తలను, విద్యా వేత్తలను, సాంఘిక వేత్తలను, ప్రణాళికా స్రష్టలను పెక్కుమందిని గాంధీయుగం మనకు ప్రసాదించింది. అయితే ఏకకాలంలో వివిధ రంగాలలో కృషిచేసిన ఖ్యాతి వీరిలో కొందరికే దక్కినది. బహుముఖ ప్రతిభాశాలియైన డాక్టర్ జాకిర్ హుస్సేన్ తాను ప్రవేశించిన పెక్కు రంగాలలో ప్రశంసాపాత్ర మైన రీతిలో కృషిచేసి తన జీవితకాలంలోనే కీర్తి శిఖరాన్ని చేరుకున్నారు.

## హైదరాబాదులో జననం

శ్రీ జాకిర్ హుస్సేన్ 1897 సంవత్సరం ఫిబ్రవరి 8వ తేదీన హైదరాబాద్‌లో ఒక మధ్యతరగతి పఠాన్ కుటుంబంలో జన్మించారు. ఆయన తండ్రి న్యాయవాది. జాకిర్ హుస్సేన్ 8వ యేట ఆయన కుటుంబం ఉత్తర ప్రదేశ్‌లోని ఇటావాకు తరలినది. అక్కడ ఉన్న పాఠశాలలోనే ఆయన విద్యాభ్యాసం చేసారు. ఆతరువాత అలీగఢ్ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యపూర్తి చేసుకొని జర్మనీవెళ్లి బెర్లిన్ విశ్వవిద్యాలయంలో పి. హెచ్. డి. పట్టా పుచ్చుకున్నారు.

## కార్యదీక్ష

రాజకీయాలలో మతాతీత దృక్పథమనేది మన దేశానికి కొత్తకాదు, పెక్కుమంది జాతీయవాద ముస్లిమ్ మహానాయకులు స్వాతంత్ర్య సమరంలో ఇతర మతాలవారితో భుజంకలిపి అగ్రశ్రేణిలో నిలిచి పోరాడారు. ఇతరులెవరికి తీసిపోని విధంగా త్యాగాలు చేసారు. ఇటువంటి సాంప్రదాయాలుగల వాతావరణంలోనే జాకిర్ హుస్సేన్ రాజకీయ దృక్పథానికి, ఆశయాలకు, ఆదర్శాలకు ప్రాతిపదిక ఏర్పడింది. మౌలానా

అబుల్ కలామ్ ఆజాద్ సేవాతత్పరత, కార్యదీక్ష, క్రమశిక్షణా యుత జీవితంవల్ల జాకిర్ హుస్సేన్ ప్రభావితులై ఆ గుణాలన్నిటిని ఆయననుండి పుణికి పుచ్చుకున్నారు.

దేశపరిస్థితులనుబట్టి మన బాలల్లో వ్యక్తిత్వవికాసానికి తోడ్పడేందుకై గాంధీజీ 1930 ప్రాంతంలో బేసిక్ విద్యాపథకాన్ని రూపొందించారు 1937 లో శ్రీ జాకిర్‌హుస్సేన్ జాతీయ విద్యా సంఘం అధ్యక్షుడుగా నియమింపబడినారు. జాతీయ విద్యాసంఘం ఆయన నాయకత్వాన బేసిక్ విద్యా విధానం మౌలిక సూత్రాలను వివరాలను రూపొందించినది 1938 సంవత్సరం నుండి దాదాపు పదేళ్లపాటు ఆయన హిందుస్తానీ తాలీమ్ సంఘ అధ్యక్షులుగా ఉన్నారు.

## ప్రముఖ విద్యావేత్త

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మనదేశంలో అగ్రశ్రేణి విద్యావేత్తలలో ఒకరు. ఆయనకు విద్యారంగంతో చాలా కాలంగా సంబంధంఉన్నది ప్రాంతీయ భాషలలో విద్య బోధించడానికి ప్రయోగాలు, ప్రయత్నమూ చేయాలని ఆయన చాలాకాలంగా వాదిస్తున్నారు. ఢిల్లీలో గల మిలియా విశ్వవిద్యాలయానికి [జామె మిలియా] ఆయన ౨౨ ఏళ్లపాటు వైస్‌ఛాన్సలర్‌గా కొనసాగారు. ఈకాలంలో ఉర్దూభాషపట్ల ప్రజలలో ఆదరణ, అభిమానం పెంపొందడానికి ఈవిశ్వవిద్యాలయంలో విశేషకృషి జరిగింది 1948 సంవత్సరం నుండి పదేళ్లపాటు అలీగఢ్ ముస్లిమ్ విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్సలర్‌గా ఉన్నారు. ఈ కాలంలో ఆయన ఈ విశ్వవిద్యాలయంలో పాతపద్ధతులను మార్చి కాలానుగుణమైన సంస్కరణలను తెచ్చారు.

విద్యారంగంలో ఉన్నతస్థాయి సంస్థఅయిన యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్, సెకండరీ ఎడ్యుకేషన్ కమిషన్‌లో కూడా శ్రీజాకిర్ హుస్సేన్ కొంతకాలం సభ్యులుగా ఉన్నారు. డాక్టర్ రాధాకృష్ణన్ అధ్యక్షతన ఏర్పడిన యూనివర్శిటీ విద్యాకమిషన్‌లో సభ్యులుగా ఉంటూ ఈ కమిషన్ సమర్పించిన చరిత్రాత్మక నివేదికను రచించడంలో జాకిర్‌హుస్సేన్ ప్రముఖపాత్ర వహించారు. ప్రెస్ కమిషన్ సభ్యుడుగా ఆయనచేసిన సేవను పత్రికల వారు విస్మరించ జాలరు. చిన్నపత్రికల అభివృద్ధికి సంబంధించిన సమస్యల పట్ల అధికంగా శ్రద్ధచూపారు

## ఘనసత్కారాలు

జాకిర్‌హుస్సేన్ చేసిన సేవను గుర్తించి దేశం ఆయను పెక్కు విధాల సత్కరించింది 1957లో ఆయనను బీహార్ గవర్నర్‌గా నియమించారు. ఐదేళ్లపాటు ఆపదవిలో ఉన్నతర్వాత 1962 డాక్టర్ రాధాకృష్ణన్ స్థానంలో ఉపరాష్ట్రపతిగా ఎన్నికైనారు రాజ్యసభచైర్మన్‌గా ఉంటూ ఆయన సభలోని అన్నివర్గాలవారి అభిమానాలకు పాత్రులయినారు. సభ గౌరవమర్యాదలను అతి దక్షతతో కాపాడి కృతకృత్యులైనారు. చైర్మన్‌గా ఉంటూ ఆయన ఎంతో హుందాతో నిష్పాక్షికంగా, సరదాగా హాస్యంతో వ్యవహరించారని ఇటీవల ఆయనకు వీడ్కోలు చెప్పడానికై ఏర్పాటుచేసినసభలో ప్రసంగిస్తూ ప్రధాని ఆయనను ప్రశంసించారు ప్రతి పక్ష నాయకులుకూడా ఆయన నిష్పాక్షిక దృష్టికి, న్యాయశీలానికి జోహార్లర్పించారు.

1954 లో ఆయనకు పద్మవిభూషణ బిరుదును ప్రదానం చేసారు తొమ్మిదేళ్లతరువాత భారతరత్న బిరుదు ఇచ్చారు. దేశంలోని పెక్కు విశ్వవిద్యాలయాలు ఆయనకు గౌరవ డాక్టరేట్ ప్రదానంచేసి సత్కరించినవి విదేశాలలోకూడా ఆయనకు మంచి గౌరవప్రతిష్ఠలు కలవు 1956 నుండి 58 వరకు రెండేళ్లపాటు యునెస్కో కార్యనిర్వాహకవర్గ సభ్యుడుగా ఉన్నకాలంలో ప్రపంచంలోని వివిధ జాతుల సాంస్కృతికాభ్యున్నతికి విశేష కృషిచేసారు. భారతజాతి ఉత్తమ సాంప్రదాయాలు, ఓర్మి, కార్యదీక్ష, సర్వమత సహిష్ణుత, మతాతీతదృక్పథం మూర్తీభవించిన వ్యక్తి డాక్టర్ జాకిర్‌హుస్సేన్.

[ఆంధ్రభూమి సౌజన్యంతో]





# మన ఉపరాష్ట్రపతి

శ్రీ వరహాగిరి వెంకటగిరి ఒరిస్సా రాష్ట్రంలో గంజాం జిల్లాలోని బరంపురంలో 1891 ఆగస్టు 10వ తేదీన జన్మించారు. వారి తండ్రి శ్రీ వి. వి జోగయ్య పంతులుగారు స్థానికంగా బాగా పేరు మోసిన న్యాయవాది. శ్రీ గిరి బరంపురంలోని కల్లికోట కళాశాలలో ప్రారంభ విద్య అభ్యసించారు. చిన్నతనంలోనే వారికి గ్రంథాలయోద్యమం పట్ల ప్రీతి ఏర్పడింది. తమ పట్టణంలో ఒక గ్రంథాలయాన్ని నెలకొల్పి తరువాత దానికొరకు ఒక విశాలమైన భవనాన్ని కూడా సమకూర్చారు

శ్రీ గిరి ఉన్నత విద్యాభ్యాసానికి ఐర్లాండ్ వెళ్లి 1916 వ సంవత్సరంలో బ్యారిష్టర్ (ఆనర్స్) అయ్యారు. అయితే 1916 జూన్‌లో వారిని యు.కె నుంచి బహిష్కరించి ఇండియాకు పంపివేయడంవల్ల వారు తమ డిగ్రీని పుచ్చుకొనలేక పోయారు. ఐర్లాండ్ జాతీయ విశ్వవిద్యాలయం విద్యార్థిగావున్న రోజులలోనే శ్రీ గిరి 'సిన్‌ఫీన్' ఉద్యమపు రాజకీయ కార్యకలాపాలలో ప్రముఖ పాత్ర వహించేవారు. ఈ కారణం చేత ఆనాటి ప్రముఖ మేధావులు కొలిన్స్, పియర్స్, డివెలెరా, ఫిట్జ్ గెరాల్డ్, స్విఫ్ట్ మెక్‌నీల్, స్కిఫింగ్టన్, జేమ్స్ కన్నల్లీ, జిమ్‌లర్కిన్ కౌంటెస్ మార్కోవిచ్ ప్రభృతులతో వారికి సాన్నిహిత్యం ఏర్పడింది. ఈ పరిచయాలవల్ల విభిన్న రాజకీయ సిద్ధాంతాలను అవగాహన చేసుకోవడానికి శ్రీ గిరికి అవకాశం కలిగింది.

## రాజకీయ రంగం

గిరి 1916 వ సంవత్సరంలో భారత దేశానికి తిరిగి వచ్చారు. అప్పుడే దేశంలో రాజకీయ పరిస్థితులు ఒక ముఖ్య ఘట్టానికి చేరుకున్నాయి. అప్పటికే రాజకీయ రంగంలో ప్రాముఖ్యం లోనికి వచ్చిన కాంగ్రెసులోనూ, హోంరూల్ లీగ్ లోనూ శ్రీ గిరి తక్షణమే చేరారు. తరువాత రెండు సంవత్సరాలకు గాంధీజీ సత్యాగ్రహోద్యమం ప్రారంభించడంతో శ్రీగిరి

ఆ ఉద్యమంతో సంబంధం ఏర్పరచుకున్నారు. మహాత్ముని పిలుపు ననుసరించి 1921 వ సం. లో బాగా లాభసాటియైన న్యాయవాద వృత్తిని త్యజించి ఉద్యమానికి పూర్తిగా అంకితులయ్యారు. తత్ఫలితంగా నిర్బంధించబడి కొద్ది కాలంపాటు జైలు శిక్ష అనుభవించారు.

భారత దేశంలో మార్గదర్శకులైన కార్మిక నాయకులలో శ్రీ గిరి ఒకరు. ఈ రంగంలో వారు ఎల్లప్పుడూ నిర్మాణాత్మకంగా, ఫలప్రదంగా కృషి జరిపారు. 1922వ సంవత్సరంలోనే వారు కార్మిక సంస్థలతో సన్నిహిత సంబంధం ఏర్పర్చుకున్నారు. కార్మికోద్యమ పిత శ్రీ ఎన్. ఎం. జోషికి ముఖ్య అనుయాయిగా రూపొందారు. ఒక సంవత్సరం పిమ్మట కొంతమంది ముఖ్యులతో కలిసి అఖిల భారత రైల్వే ఉద్యోగుల సమాఖ్యను స్థాపించారు. రైల్వే ఉద్యోగుల ప్రయోజనాలను పరిరక్షించుటకై ఏర్పడిన సంస్థలలో బహుశః ఇదే పెద్దది. శ్రీ గిరి 1926 వ సంవత్సరంలోనూ 1942 వ సంవత్సరంలోనూ—రెండు పర్యాయాలు—ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ప్రముఖ కార్మిక నాయకునిగా శ్రీ గిరి అనేక అంతర్జాతీయ సమావేశాలకు హాజరయ్యారు. 1927 వ సం. లో జెనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక మహాసభలో ప్రతినిధిగా పాల్గొన్నారు. నాలుగు సంవత్సరాల తరువాత రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకు గాంధీజీతో పాటుగా కార్మికుల ప్రతినిధిగా హాజరయ్యారు.

## నిషేధాజ్ఞల ఉల్లంఘన

నాలుగవ దశాబ్ది ఆరంభంలో దేశంలో సహాయ నిరాకరణోద్యమం తీవ్రంగా సాగిన రోజులలో శ్రీ గిరి బొంబాయి, మైసూరు, మద్రాసు వంటి ముఖ్య నగరాలలో నిషేధాజ్ఞలను ఉల్లంఘించారు. అయితే వీరు ప్రసిద్ధ కార్మిక నాయకులైనందున, కార్మికులు ప్రతీకార చర్యలకు దిగగలరన్న భయంతో అధికారులు వీరిపై చర్య తీసుకోలేదు. కార్మిక జనులకు శ్రీ గిరి ఎంత ప్రేమపాత్రులో తెలుసుకోవడానికి ఇంతకంటె ప్రబల నిదర్శనం అవసరం లేదు.

శ్రీ గిరి 1934-47 సంవత్సరాల మధ్య కాలంలో కేంద్ర శాసన సభ సభ్యులుగా వున్నారు. ఆ కాలంలోనే శ్రీయుతులు సత్యమూర్తి, భూలాభాయ్ దేశాయ్, జిన్నా, పంత్, మాలవ్య, ఆసఫ్ అలీ వంటి ఉద్దండులు కూడా కేంద్ర శాసన సభ సభ్యులుగా వుండేవారు. శ్రీ గిరి గంజాం—విశాఖపట్నం నియోజక వర్గం నుంచి ఎన్నికయ్యారు.

శాసన సభముందు కార్మికసమస్య చర్చకు వచ్చినప్పుడల్లా సామ్రాజ్యవాదులకు అసంతృప్తికలుగుతుందనే భయంలేకుండా తన అభిప్రాయాలను నిష్కర్షగా వెల్లడించేవారు.

## మంత్రివర్గంలో ప్రవేశం

1937లో అప్పటి మద్రాసు రాష్ట్రంలో రాజాజీ నాయకత్వంలో ఏర్పడిన ప్రథమ కాంగ్రెసు మంత్రివర్గం భవిష్యత్ పరిపాలకులు, స్వచ్ఛంద కాంగ్రెసు సభ్యుల ప్రతిబింబంగా ఉండి. రాజాజీ మంత్రివర్గంలో ప్రకాశం, గిరివంటి ప్రఖ్యాత నాయకులు ఉండడంవల్ల ఆంధ్రులదృష్టిలో మంత్రివర్గం గౌరవ ప్రతిష్ఠలు ఇనుమడించినవి. శ్రీగిరి తన కిష్టమైన కార్మిక, పరిశ్రమలు, సహకారం, వాణిజ్యశాఖ ను నిర్వహించారు. తన మంత్రిత్వశాఖ ఎదుర్కొనే కార్మిక సమస్యలను నిర్మాణాత్మకంగాను, పురోగమన దృక్పథంతోను పరిష్కరించారు.

1946లో మద్రాసు రాష్ట్రంలో స్వల్పకాలం మనగలిగిన ప్రకాశం మంత్రివర్గంలో గిరి అదే పోర్టుఫోలియోను నిర్వహించారు. వారి కృషి ఫలితంగా కార్మిక శాఖ ఎంతో మంచి గౌరవ ప్రతిష్ఠలను మూటగట్టుకుంది. అయితే కార్మిక విషయాలతో సన్నిహిత సంబంధంగల గిరి, కార్మికుల న్యాయమైన కోర్కెలను మన్నించడంలోను, మరోవైపు అధికారుల గౌరవ ప్రతిష్ఠలను కాపాడడంలోను సామరస్యంగా వ్యవహరించి తమఖ్యాతిని నిలుపుకున్నారు.

## కార్మిక సంఘం నాయకత్వం

రెండవ ప్రపంచయుద్ధ జ్వాలలు ప్రజ్వరిల్లుతున్న సమయంలో భారతదేశంలో బ్రిటిష్‌పాలకుల దమననీతికి వ్యతిరేకంగా ఆందోళన వ్యాపించింది. ఆసందర్భంలో సంయుక్త కాంగ్రెసు ట్రేడ్‌యూనియన్ అధ్యక్షులుగా శ్రీగిరి బ్రహ్మాండమైన కార్మికోద్యమాన్ని నిర్వహించారు.

1947లో దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించినప్పుడు ప్రజాసేవకు అనేక నూతనావకాశాలు ఉద్భవించాయి. ప్రకాశం మంత్రివర్గంనుండి రాజీనామా యిచ్చిన తర్వాత నెహ్రూ ఆశీస్సులతో సిలోన్‌లో భారతదేశ మొదటి రాయబారిగా నియుక్తులైనారు. ఆ పదవీకాలంలో ఆయన భారత సిలోన్ దేశాల మధ్య పటిష్ఠమైన సన్నిహిత సంబంధాలను ఏర్పాటు చేయడంలో తీవ్రంగా కృషిచేసి కృతకృత్యులైనారు.

## బ్యాంకు అవార్డుసమస్య

1952లో ప్రథమ సార్వత్రిక ఎన్నికలు జరిగిన తర్వాత గిరి, నెహ్రూ మంత్రివర్గంలో కార్మిక మంత్రిగా, రెండు సంవత్సరాలు ఆపదవిలో ఉన్నారు. అయితే బ్యాంకు అవార్డు సమస్యపై రాజీనామాచేశారు. ఆతర్వాత పరిణామాలు, ఆయన నిర్ణయం సహేతుకమైందని నిరూపించడమేగాక ఆయన రాజకీయ దూరాలోచనలు నెహ్రూ అంతటి వారి ప్రశంసలకు పాత్రములైనాయి.

రాజకీయ అస్థిరతకు పేరొందిన కేరళలోను, ఉత్తర ప్రదేశ్‌లోను గవర్నరు పదవిని సమర్థవంతంగా, చాకచక్యంగా నిర్వహిం

చారు. 1957–1960 మధ్యకాలంలో పరస్పర విరుద్ధ అభిప్రాయాలకు నిలయమైన ఉత్తర ప్రదేశ్‌లో గవర్నరుగా ఉన్నారు.

కేరళరాష్ట్రంలో రాష్ట్రపతిపాలన తర్వాత 1965 మార్చిలో ఎన్నికలు జరిగాయి. ఎన్నికలసమయంలోను ఆతర్వాత రాష్ట్రంలో పరిపాలనా సుస్థిరతను ఏర్పరచి రాష్ట్రపురోభివృద్ధికి కృషి, యు దానికి మార్గాలను అన్వేషించంలో గిరి కీలక పాత్రవహించారు

1965 ఏప్రిల్‌లో "ఆదర్శ రాష్ట్ర" మైన మైసూరులో గవర్నరుగా నియుక్తులైనారు.

భారతదేశంలో కార్మిక ఉద్యమాలకు గిరి పట్టుగొమ్మ. దేశ పునర్నిర్మాణంలో కార్మికులు కూడ భాగస్వాములు కాగలిగే రీతిగా ఆయన వారికి మార్గదర్శకత్వంవహించి, కార్మికులు పెడ త్రోవన పడకుండా శ్రద్ధవహించారు.

## స్వర్గంలో సంభాషణ

ఇద్దరు సుప్రసిద్ధకవులు, లేదా పండితులు, అకస్మాత్తుగా ఒకరికొకరు ఎదురుపడితే వాళ్ళసంభాషణ ఎలా సాగుతుందో ఎప్పుడైనా మీరు ఊహించారా ? ఆ సంభాషణల్లో మీకు కావలసినంత కాలక్షేపం, వినోదం, విజ్ఞానం లభిస్తాయి. యిప్పుడు ఉత్తమమైన కల్పనకు తగు పారితోషికం కూడా లభిస్తుంది మీకు. ఎక్కడో తవ్వగా దొరికిన ఓ చిన్న ఎముక ముక్కనుబట్టి శాస్త్రజ్ఞుడు ఆ జంతువు రూపకల్పన చేస్తున్నాడుకదా. అలాగే ప్రసిద్ధకవి రచనలను బట్టి అతని వ్యక్తిత్వాన్ని ఊహించడం ఏమంత కష్టంకాదు. భిన్న భిన్న కాలాలకు చెందిన కవులు యిద్దరు చొప్పున కొంత మందిని యిక్కడ ఉదాహరణగా యిస్తున్నాం.

ఆ యా కవుల వ్యక్తిత్వాలను, వారి యేకత్వాలను, భిన్నత్వాలను ఊహించి వారి మధ్య సంభాషణ కొనసాగితే అది ఎలా నడుస్తుందో ఊహించి. "ఆంధ్రప్రదేశ్" మాసపత్రికలో మూడు పేజీలు మించకుండా వ్రాసి పంపించండి. ఈ క్రింద ఉదహరించిన జంటలు మచ్చుకు మాత్రమే. మీరు యే యిద్దరు ప్రఖ్యాత కవులనైనా ఎన్నుకోవచ్చు. వచ్చిన రచనలలో ఉత్తమమైనవి నిర్ణయించడంలో సంపాదకునిదే తుది నిర్ణయం.

నన్నయభట్టు—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
శ్రీనాథుడు—శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
బమ్మెరపోతన—త్యాగరాజు
పరవస్తు చిన్నయసూరి—గిడుగురామమూర్తి
తెనాలిరామకృష్ణ కవి—పసుపులేటి రంగాజమ్మ
ధూర్జటి— పాల్కురికి సోమనాథుడు
వేమన —గురజాడ

ప్రణాళికామంత్రి ప్రసంగం :

# "విశ్వసనీయమైన గణాంకములను సకాలంలో రూపొందించడం అవసరం"

ప్రణాళికా, ఆర్థిక విషయాల మంత్రి శ్రీ కె.వి. నారాయణ రెడ్డి ఏప్రిల్ 28న జిల్లా అర్థగణాంకశాఖాధికారుల తృతీయ వార్షిక సమావేశానికి అధ్యక్షత వహిస్తూ, ఏ లెక్కలైనా ఎంత జాగ్రత్తగా తయారుచేసినప్పటికీ వాటిని సమయానికి ప్రభుత్వానికి అందజేయకపోతే నిరుపయోగమే' అన్నారు. ఈ సమావేశానికి పంచాయతీరాజ్ మంత్రి శ్రీ తోట రామస్వామి ప్రారంభోత్సవం చేశారు. ఈ యిద్దరు మంత్రులు కూడా ఖచ్చితంగా అర్థ గణాంకాలను సేకరించవలసిన అవసరాన్ని గూర్చి, తగిన సమయంలో రూపొందించవలసిన అవసరాన్ని గూర్చి ప్రస్తావించారు

అర్థగణాంకశాఖ అధికారులు, అవసరమైన వివరాలను సేకరించి తగినవిధంగా, ప్రయోజనాయుతంగా ఆ వివరాలను రూపొందించాలని, తప్పుడు లెక్కలవల్ల అనేక విపరీత పరిస్థితులు ఏర్పడవచ్చునని, ఉదాహరణకు వ్యవసాయ అర్థగణాంక విషయంలో రూపొందించిన లెక్కలు తప్పు అని తేలితే ప్రజలు వ్యవసాయోత్పత్తికి సంబంధించిన ఆ లెక్కలు చూసి బెదిరి పోవడమో, లేదా మరీ సంతోషపడిపోవడమో జరుగుతుందని ప్రణాళికా మంత్రి తెలియజేశారు.

రాష్ట్ర అర్థగణాంకశాఖ ప్రచురణలను గూర్చి పంచాయతీ రాజ్ మంత్రి ప్రస్తావిస్తూ యీ ప్రచురణల్లో ముఖ్యమైనవి కొన్ని తెలుగులో కూడా రావాలని సూచించారు.

ప్రణాళికామంత్రి ప్రసంగం :

"ఆచరణ యోగ్యమైన లెక్కలతో ప్రమేయంలేకుండా ప్రణాళికా కార్యక్రమాలకు సంబంధించిన అర్థగణాంకవిషయాలను రూపొందించడంగాని, అసలు పరచడంగాని, మదింపు వేయడం గాని సాధ్యమని నేను అనుకోవడంలేదు. శక్తివంతమైన ఒకనొక విధానాన్ని రూపొందించడంగాని, ఒకానొక నిర్ణయాన్ని తీసుకోవడంగాని ఖచ్చితమైన, ఆచరణ యోగ్యమైన లెక్కల ప్రమేయంలేకుండా వీలుకాదు. విధానానికి, పరిపాలనకు సంబంధించిన విషయాలలో, ముఖ్యంగా ప్రణాళికాభివృద్ధికి సంబంధించిన విషయాలలో మామూలుగాకాక ఆసక్తి ధోరణి అనుసరించే టప్పుడు అర్థగణాంక వివరాలపై ఆధారపడక తప్పదు. అయితే తాగుబోతు దీపస్తంభాన్ని ఉపయోగించే తీరుగా యీ లెక్కలను మనం ఉపయోగించకూడదు. మార్గాన్ని కనుక్కోవడానికి కాకుండా తూలిపడిపోకుండా ఆధారంగా పట్టుకోడానికి దీపస్తంభాన్ని తాగుబోతు ఉపయోగిస్తాడు. క్రితం శతాబ్దంలో ఇంగ్లాండు ప్రధానిగావున్న బెంజమిన్ డిస్రాయిలీ ఒకసారి యిలాఅన్నారు-

అబద్ధాలు మూడురకాలు:- మామూలు అబద్ధాలు, అభూతకల్పనలు అర్థగణాంకాలు.

అర్థగణాంకాలను అబద్ధాలుగా ఆయన ప్రస్తావించా డంటే అర్థంలేకపోలేదు. ఆరోజుల్లో అర్థగణాంకాలుఅంటే కేవలం అంకెలతో కూడిన స్టేట్‌మెంట్స్ మాత్రమే. అయితే యీనాడు మనదేశంలోనూ, ప్రపంచ మంతటాకూడా అర్థగణాంక విషయాల సేకరణకూ, వాటిని రూపొందించడానికీ బాగా అభివృద్ధిచెందిన వ్యవస్థలు వున్నాయి. ఆధునిక పద్ధతులను యివి అమలుపరుస్తున్నాయి. అయితే యింత మాత్రంచేత ఏ ప్రయోజనమూ చేకూరదు. ప్రభుత్వం ప్రణాళికలను, విధానాలను రూపొందించుకోవడానికి అవసరసమయంలో ఖచ్చితమైన అర్థగణాంక సమాచారాన్ని ప్రభుత్వానికి అందివ్వలేకపోతే ఎంత అభివృద్ధి చెందిన వ్యవస్థవుండినా లాభంలేదు.

మన విజయాలను, పరాజయాలను మదింపు వేసుకోవడానికి యీనాడు జరుగుతున్న యీవిధమైన వార్షిక సమావేశాలు అవసరం. దీనివల్ల వ్యవస్థలోని లోటుపాట్లను సరిదిద్దుకోవడానికి, మనశక్తి సామర్థ్యాలను మెరుగు పరచుకోవడానికి యిదొక చక్కటి మార్గం. అవసరమైన అర్థగణాంకవిషయాలను సేకరించడం, వానిని తగు విధంగా రూపొందించడం మాత్రమే మీరు చేయాల్సినపని కాదు. ప్రభుత్వానికి ఆసమాచారాన్నీ, ఆలెక్కలనూ తగుసమయంలో ముందుగా అందజేయడంకూడా మీబాధ్యతే. ప్రభుత్వం ఏచర్య తీసుకోవాలన్నా మీరు అందజేసేలెక్కలు సమయానికి అందకపోతే ప్రయోజనంలేదు. తప్పుడులెక్కల వల్ల, నిర్లక్ష్యంగా రూపొందించిన వివరాలవల్ల ఎలాంటి ప్రమాదాలున్నాయో ప్రత్యేకించి మీకు చెప్పనక్కరలేదు. అటువంటివాటి వల్ల ప్రభుత్వానికి ఏవిధమైన ప్రయోజనమూలేకపోగా అనేక ప్రమాద పరిస్థితులు ఏర్పడ్డానికి కూడా కారణమౌతాయి. ఆలెక్కల ఆధారంగా ప్రభుత్వం ఏచర్యనైనా తీసుకుంటే అది అంత సమర్థవంతంగా వుండదు. పైగా ప్రభుత్వానికి భంగకరంగాకుడా వుండవచ్చు. వ్యవసాయ అర్థగణాంక విషయాలే తీసుకోండి. తప్పుడు లెక్కల వల్ల వ్యవసాయోత్పత్తి పరిస్థితులు చాలాక్లిష్టంగా వున్నట్టయినా తెలియజేయవచ్చు లేదా మరీ సంతోషాన్నయినా కలిగించవచ్చు. వాస్తవం తెలిసిననాడు ఈరెంటివల్లా అవాంఛనీయ పరిస్థితులు ఏర్పడ్డానికి అవకాశంవుంది.

అందుచేత అర్థగణాంక వివరాలను జాగ్రత్తగాను, సమగ్రంగానూ రూపొందించవలసిన అవసరాన్ని గూర్చి, మీ కృషిని యిటుగా కేంద్రీకరించవలసిన అవసరాన్ని గూర్చి నేను

( తరువాయి 12 వ పుటలో )

# మానవుడి కోపం

సంపతి

ప్రస్థావాటు ఉష్ణంగా గుపిరవిగట్టి
భూగోళాన్ని రెండు చేతుల్తో ఎత్తి
సముద్రంలోకి విసిరేశాడు మానవుడు
అతనికి మహాచెడ్డ కోపంవచ్చింది_
నిజంగా గుండ్రంగావున్న తను
బల్లపరుపుగా కనిపించటం దేనికి ?
అంత వేగంగా తిరిగే తను
స్థాణువుగా నటించడం దేనికి ?

ఒక్కసారి దిక్కులు పిక్కటిల్లే కేకేసి
అనూహ్యంతం ఆకాశాన్ని చాపచుట్టి
గాలిలోకి విసిరేశాడు మానవుడు
అతనికి మహ చెడ్డకోపం వచ్చింది_
నిజంగా ఆకారంలేని తను
నీలంగావున్నట్టు కనిపించడందేనికి ?
అంతటా ఆవరించుకున్న తను
అంత దూరభూమిగా నటించడం దేనికి?

నిశితంగాచూసి కళ్ళల్లో నిప్పులు చెరుగుతూ
సముద్రాన్ని దోసిట్లోపట్టుకొని
గుక్కలో జఠరాగ్నిమీద కుమ్మరించాడు మానవుడు
అతనికి మహ చెడ్డకోపం వచ్చింది_
నిజంగా చల్లగావుండే తను
కడుపులో బడబాగ్నిదాచటందేనికి ?
దూరాన తీరాలు కట్టిన తను
అపారమని నటించడం దేనికి ?

విశ్వాన్ని క్షణంలో కాల్చే ఓ వేడినిట్టూర్పు విడిచి
గాలిని మెడపట్టిగెంటుతూ
పృథ్వీ మీదికి ఊదేశాడు మానవుడు
అతనికి మహాచెడ్డకోపం వచ్చింది_
ఉన్నాసని చెట్లఆకులు ఊపిస్తూనే తను
దొంగలా దాక్కోవడం దేనికి ?
ఊపిరి పోతున్నాసరే చెప్పకుండా
ఉరుకులు పేరాలు పెట్టడం దేనికి ?

హఠాత్తుగా లేచి పదిదిక్కులూ పరికించి
నిప్పుముద్దలను బంతులాడుతూ
ఆకాశంలోకి విసిరేశాడు మానవుడు.
అతనికి మహ చెడ్డకోపం వచ్చింది_
లేనివారి కడుపులో ఇల్లుకట్టుకొని
వున్నట్లు కనిపించడం దేనికి ?
అయిందీ కానిదీ స్వాహా చేసే తను
పరమ పవిత్రంగా నటించడందేనికి ?

లేస్తే మనిషికాని మానవుడికి
తనమీద తనకేకోపం వచ్చింది
అణువును గోటితో చిట్లించాడు
ఆచేయి శిరస్సున పెట్టుకొన్నాడు
భగ్గునమండి భస్మమైపోయాడు.

# ముఖ్యవార్తలు

12 ఏప్రిల్ : హైదరాబాదులో మూడు రోజులపాటు జరిగిన జిల్లా కలెక్టర్ల సమావేశాన్ని ముఖ్యమంత్రి ప్రారంభించారు.
రాష్ట్రంలో తొలి సంచార తపాలా కార్యాలయానికి ముఖ్యమంత్రి హైదరాబాదులో ప్రారంభోత్సవం చేశారు.

19 ఏప్రిల్ : ఉత్తమ తెలుగు చలన చిత్రాలకు రాష్ట్ర బహుమతులను, ముఖ్యమంత్రి హైదరాబాదులో జరిగిన ఒక కార్యక్రమంలో అందజేశారు.

ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి శ్రీ కాశీకృష్ణాచార్యుల వారు గుంటూరులో నిర్యాణం చెందారు.

20 ఏప్రిల్ : సిద్ధాంతం వద్ద వసిష్ఠపై రూ. 95 లక్షల వ్యయంతో నిర్మించిన వంతెనకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

23 ఏప్రిల్ : ఆంధ్రప్రదేశ్ సంచార జాతుల తొలి మహాసభ గుంటూరులో ప్రారంభమైంది.

25 ఏప్రిల్ : అఖిల భారత సర్వోదయ సమ్మేళనం శివరాంపల్లిలో మొదలయింది.

26 ఏప్రిల్ : విశాఖపట్టణం రేవు పశ్చిమ భాగంలో క్రొత్తగా ఏర్పాటుచేసిన 'ఫెర్టిలైజర్ బెర్త్' కు కేంద్ర రవాణా, నౌకాయాన శాఖల మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

హిందుస్తాన్ నౌకానిర్మాణ సంస్థ నిర్మించిన 46 వ సరుకుల నౌక 'విశ్వసేవ' కు విశాఖపట్టణంలో కేంద్ర రవాణా నౌకాయాన శాఖల మంత్రి జల ప్రవేశోత్సవం చేశారు.

2 మే : సూడాన్ రాష్ట్రపతి సయ్యద్ ఇస్మాయిల్ ఎల్ అజ్హరి రెండు రోజుల పర్యటనపై హైదరాబాదుకు విచ్చేశారు.

6 మే : పంచాయతీరాజ్ పరిపాలనకు సంబంధించినవారి మహాసభను హైద్రాబాదులో ముఖ్యమంత్రి ప్రారంభించారు. ఈ సభ రెండు రోజులపాటు జరిగింది.

సాంఘిక కార్యకర్త శ్రీ వి. కె. ధగే హైద్రాబాదులో దివంగతులైనారు.

## దేశంలో

12 ఏప్రిల్ : జవహర్‌లాల్ నెహ్రూ తొలి అవార్డును రాష్ట్రపతి, ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి శ్రీ ఉథాంట్‌కు న్యూఢిల్లీలో అందజేశారు.

25 ఏప్రిల్ : ఆస్ట్రేలియా గవర్నరుజనరల్ ప్రైవేటు పర్యటనపై న్యూఢిల్లీకి చేరుకున్నారు.

26 ఏప్రిల్ : శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా రాజస్థాన్ ముఖ్యమంత్రిగా జైపూర్‌లో పదవీప్రమాణం చేశారు.

27 ఏప్రిల్ : అఖిల భారత ఉత్పత్తిదార్ల సంస్థ 27వ వార్షిక సమావేశాన్ని ఉప ప్రధాని న్యూఢిల్లీలో ప్రారంభించారు.

28 ఏప్రిల్ : మూడురోజుల పాటు జరిగే రాష్ట్ర విద్యాశాఖ మంత్రుల సమావేశం క్రొత్త ఢిల్లీలో ప్రారంభమైంది.

భారతదేశంలో 8 రోజుల పర్యటనపై అల్‌జహారీ క్రొత్త ఢిల్లీ చేరుకున్నారు

29 ఏప్రిల్ : పరిపాలన సంస్కరణల సంఘం అధ్యక్షులు తమ నివేదికను ప్రధాన మంత్రికి సమర్పించారు.

1 మే : 1967–68వ సం॥ దిగుమతుల విధానాన్ని ప్రకటించారు.

శ్రీ బి. గోపాలరెడ్డి ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా పదవీ ప్రమాణ స్వీకారం చేశారు.

2 మే ఉభయ దేశాల మధ్య ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలను పటిష్ఠ చేసేందుకు వీలుగా భారత–బల్గేరియా దేశాల మధ్య రెండు ఒప్పందాలపై సంతకాలు జరిగాయి.

5 మే . ప్రజా శ్రేయస్సు దృష్ట్యా ధరఖాస్తుదారుకు ప్యాసుపోర్టు నిరాకరించే అధికారన్ని కేంద్ర ప్రభుత్వానికి కల్పిస్తూ భారత ప్రభుత్వం ఆర్డినెన్సు జారీ చేసింది.

6 మే : శ్రీ వి.వి. గిరి, భారత ఉపరాష్ట్రపతిగా ఎన్నికైనారు.

9 మే : డాక్టర్ జాకిర హుస్సేన్ భారత రాష్ట్రపతిగా ఎన్నికైనారు.

## విదేశాలలో

19 ఏప్రిల్ : పశ్చిమ జర్మనీ మాజీ చాన్సలర్ శ్రీ కొనార్ అడినోవర్ రోహెన్‌డోర్ఫ్ (పశ్చిమ జర్మనీ)లో మరణించారు.

20 ఏప్రిల్ : చంద్రగోళంపై మనుష్యులులేని అంతరిక్ష నౌక ప్రయోగాన్ని అమెరికా విజయవంతంగా నిర్వహించింది.

బ్రిటానియా విమానానికి నికోసియా వద్ద ప్రమాదం సంభవించి 124 మంది నిహతులైనారు.

21 ఏప్రిల్ గ్రీస్‌లో సైనికాధికారులు పరిపాలనను హస్తగతం చేసుకొన్నారు.

24 ఏప్రిల్ సోవియట్ అంతరిక్ష యాత్రికుడు శ్రీ వాడిమిర్ కొమరోవ్, తన అంతరిక్ష నౌక సొయిజ్–1 భూమిని ఢీకొన్న ఫలితంగా మరణించారు.

29 ఏప్రిల్ : ఉపరాష్ట్రపతి, నిరగాన్ విశ్వ విద్యాలయంలో స్నాతకోపన్యాసం చేశారు.

4 మే : భారతదేశ హాకీజట్టు, మాడ్రిడ్‌లో స్పైన్ జట్టును 1–0 గోలుతో ఓడించి అంతర్జాతీయ హాకీ బిరుదును పొందింది.

బ్రిటీష్ బ్యాంకు రేటును 6 నుండి 5½ శాతానికి తగ్గించారు.

# అమీబియాసిస్ వ్యాధి

## నివారణకు హైదరాబాదులో పరిశోధనలు

ఉష్ణదేశాలలో చాలా ఎక్కువగా కనిపించే అమీబియాసిస్ అనే వ్యాధిగురించి హైదరాబాదులో పరిశోధనలు జరుగుతున్నాయి. వ్యాధిని వ్యాప్తం చేస్తున్న జీవధాతువు గురించి నూతన విషయాలు తెలిసాయి. ఈ వ్యాధిని త్వరగా కనిపెట్టే నూతన పద్ధతులు అన్వేషిస్తున్నారు.

ఉస్మానియా వైద్య కళాశాల తాలూకు వైద్యశాస్త్రాల పరిశోధనాలయంలో ఈ మూడు సంవత్సరాల పరిశీలన 1964 లో ప్రారంభమైంది. పేథాలజీ శాఖ నాయకుడు, ప్రొఫెసర్ అయిన డాక్టర్ పి. గోపాలరావు పరిశోధనలు జరిపిస్తున్నారు. మేరీలెండ్ (అమెరికా) లోని బెత్‌స్డాలో ఉన్న జాతీయ ఆరోగ్య పరిశోధనాలయంవారు దీనితో సహకరిస్తున్నారు. ఇండియాలోని పి. ఎల్. 480 నిధులనుంచి ఈ పరిశోధనలకోసం అమెరికా ప్రభుత్వం 6 లక్షల రూపాయలిచ్చింది.

డాక్టర్ గోపాల్‌రావు 1962 లో ఆరు నెలలు అమెరికాలో పర్యటిస్తున్నప్పుడు ఎన్. ఐ. హెచ్. అధికారులతో జరిపిన ఇష్టాగోష్ఠి సంభాషణల మూలంగా ఈ ప్రాజెక్టు భావం కలిగింది. ఆయన్ని అమెరికా అంతర్జాతీయాభివృద్ధి సంస్థవారు అమెరికాకు పంపారు.

డాక్టర్ గోపాలరావుతో ఈ పరిశోధనల సాగుదల గురించి ఇటీవల ఒక ఇష్టాగోష్ఠి సంభాషణలో, ఆ వ్యాధిలో ఉన్న కొన్ని చిక్కులక్షణాల గురించి ఆయన తెలిపారు. అమీబియాసిస్ వ్యాధి ఎందుకు వస్తుందో ఒక రష్యన్ శాస్త్రవేత్త 1875 లోనే కనుగొన్నప్పటికీ, ఆచిక్కు లక్షణాలను సవివరంగా పరిశీలించడం చాలా కష్టంగా ఉన్నదని చెప్పారాయన.

ప్రపంచం చుట్టు ఉన్న ఉష్ణదేశాలన్నింటిలోనూ ఈ అమోబియాసిస్ వ్యాధి ప్రబలంగా ఉన్నది. సమశీతల దేశాలలో మాత్రం ఇది ఎప్పుడోగాని కనిపించదు. అయితే ఈ వ్యాధిని కలిగించగల జీవాణువులు అమెరికా, యూరప్ ప్రజలలో కూడా ఉన్నట్టు కనిపెట్టారు; అయితే అవి వ్యాధిని కలిగించే స్థితిలోలేవు. ఉష్ణదేశాలలో అమీబియాసిస్ వల్ల వచ్చే వ్యాధులు ఇవి—మనిషిని నీరసింప చేసేజిగట విరేచనాలు (అమీబిక్ డిసెంట్రీ); దీర్ఘ అజీర్ణ రోగం (క్రానిక్ డిస్పెప్సియా); కాలేయం (లివర్) వాపు (హెపటైటిస్); లివర్ అబ్సెస్.

వ్యాధికారకమైన జీవాణువు వేర్వేరు దేశాలలో వేర్వేరు విధాలుగా ప్రవర్తించడానికి కారణమేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకొనడమే హైదరాబాదులో జరుగుతున్న పరిశోధనల ముఖ్యాశయము.

గత రెండున్నర సంవత్సరాలలోనూ డాక్టర్ గోపాలరావు ప్రభృతులు 250 మంది వ్యాధిగ్రస్తులను పరిశీలించారు. వారి వ్యాధులు వివిధ దశలలో, రకరకాలుగా ఉన్నటువంటివి. డాక్టర్ గోపాలరావు ప్రభృతులు ఆరోగ్యవంతులను కూడా 1500 మందిని పరీక్షచేశారు. తెల్ల ఎలుకలు మొదలైన వాటిమీద జాగ్రత్తగా ప్రయోగాలు చేశారు. ఉష్ణ సమశీతోష్ణ దేశాలలోని ప్రజల అన్నపానీయాలలో తేడాలున్నాయి కనుక, ఆహార పదార్థాలు కారణమేమోననీ చెప్పి జంతువుల మీద ఆ ప్రయోగాలు చేసి చూశారు.

వాటి ఫలితంగా తేలినదేమిటంటే బలంలేని ఆహారం తినిన జంతువులలో అమీబియాసిస్ వల్ల ఈ వ్యాధుల లక్షణాలు కనిపించాయి. అందుచేత పౌష్టిక ఆహారలోపం ఈ వాధికి కారణంగా కనిపిస్తున్నది. ఉష్ణదేశాలన్నింటిలో ఉన్నదికూడా పౌష్టిక ఆహారలోపమే.

మరొక విచిత్రమేమిటంటే అమీబియాసిస్ ఒక్కొక్క మనిషిలో ఒక్కొక్క విధంగా వ్యాధులు కలిగిస్తున్నది. ఉదాహరణకు ఒకమనిషి జిగట విరేచనాలతో చాలా బాధపడి కోలుకొంటాడు; మరొకరికి కొంచెంగా వ్యాధి వస్తుంది. కాని దానితో జీవితాంతం బాధపడుతుంటాడు. మరొకరికి లివర్ దెబ్బతింటుంది. ఈ విషజీవాణువు ఎవరిని ఏవిధంగా బాధిస్తుందో చెప్పడం కష్టం. అందుచేత అన్నిరకాలలోను హైదరాబాదు శాస్త్రవేత్తలు పరిశోధనలు చేస్తున్నారు.

ఇ. హిస్టోలైటికా, ఇ. హార్ట్‌మన్ని అనే అమీబా స్వరూపాలను గురించికూడా డాక్టర్ గోపాలరావు పరిశోధనలు చేస్తున్నారు.

ఈ పరిశోధనలవల్ల త్వరలో కలిగేఫలిత మేమిటంటే అమీబియాసిస్ వ్యాధి నిదానంచేసే పద్ధతులను కనిపెట్టటం. ఇండియాలో ఇటువంటి పద్ధతులు ప్రస్తుతం అట్టే తెలియవు. ఈ పద్ధతులు పరిశోధకులకు ఇంచుమించు పట్టుబడినట్లే భావించవచ్చు. అమీబియాసిస్ తీవ్రంగావున్న వ్యాధిగ్రస్తులలో ఆ

జీవాణువు వారి పేగులలోను, కడుపులోను కనిపిస్తాయి. క్రానిక్ వ్యాధిగ్రస్తులలో మాటికి 30 నుండి 40 మందిలో ఆ జీవాణువులను కనిపెట్టలేరు. వారి రక్తాలను పరీక్షచేసి కనిపెట్టే ఉత్తమ పద్ధతిని హైదరాబాదులో డాక్టరు కనుగొన్నారు

డాక్టరు గోపాలరావు లండన్ యూనివర్సిటీ స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్ అనే కళాశాలలో ఉన్నత వైద్య విద్యాభ్యాసం చేస్తుండగా ఆయనకు అమీబియాసిస్ వ్యాధిపై పరిశోధనలు జరపాలని ఆసక్తి కలిగింది. ఆ వైద్య కళాశాలలోనే ఆయన ఈ అమీబియాసిస్ విషయంలోనే పి. హెచ్. డి. డిగ్రీ సంపాదించారు.

డాక్టర్ గోపాలరావు 1952లో ఉస్మానియా మెడికల్ కాలేజిలో చేరిన తరువాతకూడా ఈ వ్యాధినిగురించి ప్రత్యేకశ్రద్ధ వహిస్తూ వచ్చారు. ఎన్. 7. హాచ్. (అమెరికా) శాస్త్రవేత్తలు కనిపెట్టిన విషయాలతో తను కనుగొన్నవి పోల్చిచూసుకొంటుంటారు. ఎన్. 7. హాచ్. శాస్త్రవేత్తలలో ఒకరైన డాక్టర్ లూయీ డైమండ్ గత ఫిబ్రవరి నెలలో హైదరాబాదుకు వచ్చారు. విదేశ శాస్త్రవేత్తలు ఇక్కడకు సంవత్సరానికి రెండుమూడుసార్లు వస్తుంటారు.

హైదరాబాదు శాస్త్రవేత్తల తుది నివేదిక ఈ సంవత్సరం సెప్టెంబరు నెలలో వెలువడగలదు. ప్రపంచ వైద్య శాస్త్రవేత్తలకు ఇదిచాలా ఆసక్తి కలిగిస్తుంది. ఎందుకంటే, ఉష్ణ దేశాలలో అంతు చిక్కకుండా తప్పించుకొంటున్న ఒక పెద్ద వ్యాధిని నిరోధించటానికి ఈ నివేదిక మార్గం చూపించవచ్చు

---

( 8వ పుటనుండి )

ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. మీ ఇబ్బందులు, ముఖ్యంగా జిల్లా స్థాయిలో మీరు ఎదుర్కొనే ఇబ్బందులు, నాకు తెలుసు. పరిశీలక కృషిలో నిమగ్నమైన జిల్లా అర్థగణాంక శాఖాధికారి రాకపోకలకు తగిన రవాణా, వాహన సౌకర్యాలులేక అనేక ఇబ్బందులకు లోనుకావలసి వస్తున్న విషయంకూడా విస్మరించలేదు.

అటు సమితి స్థాయిలో మొదలుకొని యిటు రాష్ట్రస్థాయి వరకు ఈ శాఖను పునర్వ్యవస్థీకరించాలని ఆలోచిస్తున్నాను. అదే సమయంలో అజమాయిషీ మరింత కట్టుదిట్టం చేయడంద్వారనూ, సరియైన స్క్రూటినీ ద్వారానూ, భోగట్టాను ఎప్పటికప్పుడు పరిశీలించే ఏర్పాట్లను ఎక్కువ చేయడంవల్లనూ అర్థగణాంక వివరాలను మరింత వాస్తవంగానూ, సమగ్రంగానూ, సమయానికి విడుదలయ్యే విధంగాను చేయాలని భావిస్తున్నాను.

ఈ సమావేశంవల్ల జిల్లా అర్థగణాంక అధికారులకు రాజధానిలోని అధికారులతో తమ సమస్యలను గురించి చర్చించే అవకాశం ఏర్పడ్డమేగాక వారి సమస్యల పరిష్కారానికి కూడా తావు ఏర్పడిందని భావిస్తున్నాను."



# వార్తా చిత్రాలు



రెండు రోజులపాటు జరిగే రాష్ట్ర ముఖ్యమంత్రుల, ఆహార మంత్రుల సమావేశానికి క్రొత్త ఢిల్లీలో ప్రధాన మంత్రి ఏప్రిల్ నెలలో ప్రారంభోత్సవం చేశారు.

ముఖ్య మంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, రెవెన్యూ మంత్రి శ్రీ పి. వి. రాజు అస్సాం ముఖ్యమంత్రితో సంభాషించడం ఈ చిత్రంలో చూడవచ్చు



తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయప్రాంగణంలో ముఖ్యమంత్రి



జూబ్లీహాలులో మే 6 వ తేదీన పంచాయతీ రాజ్ సంస్థ పరిపాలకులకు సంబంధించిన సమావేశానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం జరిపారు.



ఆంధ్ర ప్రదేశ్ ఆయుర్వేద మండలి వారి 'ధన్వంతరి' భవనానికి హైదరాబాదులో మే 4వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం జరిపారు. ఆరోగ్య, వైద్య శాఖ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు ఆ సందర్భంలో ఏర్పాటైన సమావేశానికి అధ్యక్షత వహించారు

# నగరానికి ప్రముఖుల రాక



సూడాన్ అధ్యక్షుడు సయ్యద్ ఇస్మాయిల్-అలీ-అజారీకి బేగంపేట విమానాశ్రయంలో మే 2వ తేదీన స్వాగతం చెప్తున్న గవర్నరు, ముఖ్యమంత్రి ప్రభృతులు



బేగంపేట విమానాశ్రయంలో గవర్నరు, ముఖ్యమంత్రి, మేయరు ప్రభృతులతో సూడాన్ అధ్యక్షుడు



సూడాన్ అధ్యక్షుడు చార్‌మినార్‌ను సందర్శించినప్పటి చిత్రం



సూడాన్ అధ్యక్షుని గౌరవార్థం రాజభవన్‌లో ఒక సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటు చేయబడింది. సూడాన్ అధ్యక్షుడు, గవర్నరు, ముఖ్యమంత్రి ప్రభృతులతో సాంస్కృతిక బృందం కళాకారులు



భారతదేశంలో సింహళరాయబారి అమర్‌సింఘేకు మే 3వ తేదీన బేగంపేట విమానాశ్రయంలో స్వాగతం చెప్తున్న దృశ్యం.



భారతదేశంలో అమెరికా రాయబారి చెస్టర్ బౌల్స్ ఏప్రిల్ 18న రాజ్‌భవన్‌లో గవర్నరును కలుసుకున్నప్పటి చిత్రం



ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో ఏప్రిల్ 16 న జరిగిన బైసాఖి మేళాను సందర్శిస్తున్న కేంద్ర రక్షణ శాఖా మంత్రి సర్దార్ స్వరణ్‌సింగ్, రాష్ట్ర రెవెన్యూ మంత్రి శ్రీ వి. బి. రాజు.



అమెరికా రాయబారి ఏప్రిల్ 19 న ఆనంద నిలయంలో ముఖ్య మంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డిని కలుసుకున్నప్పటి చిత్రం



దక్షిణ భారత ఫిలిం వాణిజ్య మండలి అధ్యక్షుడూ, భారత ఫిలిం సమాఖ్య ఉపాధ్యక్షుడూ అయిన శ్రీ ఎ. ఎల్ శ్రీనివాసన్ ఏప్రిల్ 9వ తేదీన హైదరాబాదులో ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ రజతోత్సవ సందర్భంగా సావనీర్‌ను ఆవిష్కరించారు. కేంద్ర రేడియో, సమాచార శాఖా మంత్రి శ్రీ కె.కె షా అధ్యక్షత వహించారు.



ఆహార, వ్యవసాయ శాఖామంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డితో అమెరికా రాయబారి.



ఆ సందర్భంలో ప్రసంగిస్తున్న శ్రీ కె. కె. షా. →



శ్రీ మాదల వీరభద్రరావు రచించిన 'ఆంధ్రప్రదేశ్ లోని నీటిపారుదల ప్రాజెక్టులు' అన్న గ్రంథాన్ని కేంద్ర నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ కె. ఎల్. రావు హైదరాబాదులో ఏప్రిల్ 21న ఆవిష్కరించినప్పటి చిత్రం. శాసన మండలి అధ్యక్షుడు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.



శ్రీ జయప్రకాశ్ నారాయణ్ హైదరాబాదులో ఏప్రిల్ 27 న ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో జరిగిన బహిరంగ సభలో ఉపన్యసిస్తున్న దృశ్యం



కేంద్ర ఉక్కు, గనులు, లోహాల శాఖామంత్రి డా॥ ఎం. చెన్నారెడ్డి ఏప్రిల్ 11 న పటంచేరువులో జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలకు ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం



హైదరాబాదులోని అర్థగణాంకశాఖ కార్యాలయంలో జిల్లా అర్థగణాంకశాఖాధికారుల తృతీయ వార్షిక సమావేశానికి ఏప్రిల్ 28 న పంచాయతీరాజ్ మంత్రి ప్రారంభోత్సవం జరిపారు. సమావేశానికి ప్రణాళికా మంత్రి శ్రీ కె. వి. నారాయణరెడ్డి అధ్యక్షత వహించారు.



మే 6 వ తేదీన రాష్ట్రపతి ఎన్నికలో తమ ఓటుహక్కును
వినియోగించుకొని వస్తున్న ముఖ్యమంత్రి



ముఖ్యమంత్రి ఏప్రిల్ 14 న కడపజిల్లా గజటీర్‌ను
ఆవిష్కరించినప్పటి చిత్రం
ఆ సందర్భంలో ఏర్పాటైన సమావేశానికి రాష్ట్ర
రెవెన్యూ మంత్రి శ్రీ వి. బి. రాజు అధ్యక్షత వహించారు.



హైద్రాబాదులోని జూబ్లీహాలులో ఏప్రిల్ 12 న కలెక్టర్ల సమావేశానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం





హైద్రాబాదులో ఏప్రిల్ 12 న సంచార తపాలా కార్యాలయానికి ముఖ్య మంత్రి ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం



ఆంధ్ర ప్రదేశ్ ప్రజారోగ్య, ఆసుపత్రి సిబ్బంది సంఘం 18 వ వార్షిక సమావేశానికి హైదరాబాదులో ఏప్రిల్ 10న కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు ప్రారంభోత్సవం చేశారు



స్వర్గీయ కాశీకృష్ణాచార్యులకు శ్రద్ధాంజలి ఘటించేందుకు రాష్ట్ర సమాచార కేంద్రంలో ఏప్రిల్ 23న ఏర్పాటు చేసిన సమావేశంలో ప్రసంగిస్తున్న విద్యామంత్రి శ్రీ టి. వి. రాఘవులు



హైదరాబాదులో ఏప్రిల్ 9 న అఖిలభారత ఫిల్మ్ ఫెడరేషన్ కన్వెన్షన్‌కు అధ్యక్షత వహించిన సమాచార శాఖామంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రసంగిస్తున్న దృశ్యం



పారిశ్రామికాభివృద్ధి, కంపెనీ వ్యవహారాల కేంద్ర డిప్యూటీ మంత్రి భానూప్రతాప్‌సింగ్ లఘుపరిశ్రమల అభివృద్ధికి సంబంధించిన తీవ్రతర ఉద్యమానికి ఏప్రిల్ 16న జూబ్లీ హాలులో ప్రారంభోత్సవం చేశారు. ఆసందర్భంలో జరిగిన సమావేశానికి రాష్ట్ర పరిశ్రమల శాఖామంత్రి శ్రీ వి. వి. గురుమూర్తి అధ్యక్షత వహించారు



బూరుగు మహాదేవ హాలులో ఏప్రిల్ 23 న కేంద్ర పార్లమెంటరీ వ్యవహారాల డిప్యూటీ మంత్రి శ్రీ జె. బి. ముత్యాల రావుకు సన్మాన సభ ఏర్పాటు చేయబడింది. ఆ సందర్భంలో విద్యాశాఖా మంత్రి శ్రీ టి.వి. రాఘవులు ప్రసంగిస్తున్న దృశ్యం



శ్రీశైలం ఆనకట్ట నదీగర్భం. రెండు కాంక్రీటు గోడలమధ్య నీటిని తోడివేసిన తర్వాత అడుగుభాగం దృశ్యం





సమాచార, కార్మికశాఖా మంత్రి శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ హైదరాబాదు, సనత్‌నగర్ వద్దగల బల్కంపేటలో మే 1 వ తేదీన సైంటిఫిక్ ఇంజనీరింగ్ సబ్సిడైజ్డ్ పారిశ్రామిక గృహ నిర్మాణ కాలనీకి ప్రారంభోత్సవం జరిపారు



జాతీయ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్పు గెలిచిన ఫుట్‌బాల్ బృందాన్ని అభినందించేందుకు ఏప్రిల్ 30 వ తేదీన లాల్‌బహదూర్ స్టేడియంలో ఏర్పాటుచేసిన సమావేశంలో రెవెన్యూమంత్రి శ్రీ వి. బి. రాజు ప్రసంగిస్తున్న దృశ్యం



దేశోద్ధారక శతజయంత్యుత్సవ సందర్భంగా ఏప్రిల్ 21 హైదరాబాదులో జరిగిన ఒక సభలో ప్రసంగిస్తున్న న్యాయమూర్తి ఎన్. డి. కృష్ణారావు



దోమల్‌గుడాలో మే 6వ తేదీన సాఫ్ట్‌బాల్ విజేతలకు బహుమతులను అందజేస్తున్న రెవెన్యూ మంత్రి శ్రీ వి. బి. రాజు



సికింద్రాబాదు రైల్వే ఆసుపత్రిలో నెలకొల్పిన ఎక్స్‌రే విభాగం




ప్రస్తుతం దేశవ్యాప్తంగా త్యాగరాజస్వామి ద్విశత జయంతి అతి ఘనంగా జరుపబడుతున్నది ఈ నాటికీ ఆయన తన అసంఖ్యాక కీర్తనల ద్వారా జీవించేవున్నారు. రాగసుధారసాన్ని చిందించే వారి కీర్తనలు భక్తుల హృదయాలలోనూ, సంగీత విద్వాంసుల కంఠాలలోనూ యిప్పటికీ. ఎప్పటికీ శాశ్వతంగా నిలిచే వుంటాయి. సంగీత పరిమళాలను, భక్తి మధువును అందించేసుందర సుమాలు ఆయన కీర్తనలు. సంగీత సాహిత్యాలు మూర్తీభవించిన సరస్వతీ దేవికి భక్తిప్రపత్తులతో భక్తుడు చెల్లించుకునే పూజాకుసుమాలు అవి. ఆయన పుట్టుకతో కర్ణాటక సంగీత చరిత్రలో ఒక క్రొత్త శకం ఆవిర్భవించింది. ఆయన గొప్ప వాగ్గేయ కారుడేకాదు పరమ భక్తాగ్రగణ్యుడు, మత ప్రవక్త కూడా. కనుకనే వారికీర్తనలు ఉపనిషత్సారాన్ని ప్రబోధిస్తుంటాయి. గీతామృతాన్ని గోల జేస్తాయి. ముక్తి మార్గానికి సోపానాలు వేస్తాయి సంగీత సాహిత్య ఆధ్యాత్మిక విలువలతో పరిపుష్టమై అలౌకికానందంతో హృదయాలను ఊయల లూగిస్తాయి. అయ్యవారు కర్ణాటక సంగీతాకాశంలో ధృవతార. ప్రపంచం ఉన్నంత కాలమూ ఆ నక్షత్రం కాంతి పుంజాలను వెదజల్లుతూనే వుంటుంది.




"సాయంత్రం వస్తాను. ఇంట్లోనే వుండండి." శ్రీకాంత్ పంపిన చీటీ చూచి నిజంగా చాలా సంతోషమైంది జయశ్రీకి. కాని వెంటనే అంగీకారం తెలుపటానికి కొంచం ఆలోచించ వలసే వచ్చింది. మధ్యాహ్నం ఒక సారి తప్పక తమ యింటికి రావాలని శ్రీనగేష్ ఆదేశం. 'అతడేమి మాట్లాడతాడో, ఎంత వ్యవధి తీసుకుంటుందో!' ఆ సమయంలో ఆమెకు శ్రీనగేష్ పైనా, తన తండ్రి పైనా కూడ చెప్పరాని విసుగుదలా, ఆగ్రహం కలిగాయి. "ఇవాళ కాదు, రేపు తప్పక రండి." అని సమాధానం పంపింది కడకు. అసలే విన్నటినుండీ శ్రీకాంత్ చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూన్న మనస్సు ఈ క్షణంనుండీ పూర్తిగా అతడి మయమైపోయింది. 'ఎంత మంచివాడు! ఎందుకో యింత శ్రద్ధనాపైన! నన్ను ప్రేమిస్తున్నాడా? ఔను! నన్నెంతో గౌరవిస్తున్నాడు; ప్రేమిస్తున్నాడు. అందుకే నా చుట్టూ తిరుగుతున్నాడు; ప్రత్యేక శ్రద్ధను ప్రదర్శిస్తున్నాడు. శ్రీనగేష్ లాగా గర్వంగా ప్రవర్తించడు. ఎటో బోగింప కూడదు, నగేష్ కెంత అహంకారం! ఏం చూచుకొని ఆ గర్వం? ఎంత మోసగాడు! ఇంత సన్నిహిత బాంధవ్యం వుండీ, తన వివాహాల సంగతి నెంత రహస్యంగా దాచిపెట్టాడు! ఆ తల్లి శ్రీదేవి! ఎంతటి నటనా చతుర! అంతటి హుందాతనంలోనూ ఎంతటి అల్పత్వం? తన కుటుంబ రహస్యాలేమైనా తెలియనిచ్చిందా? నయం, మోసపోయాను కాదు!.........ఛ. అసలు ఎందుకో ఇక ఆ శ్రీనగేష్ ముఖం చూడాలనిపించటం లేదు. ఏమిటో వెగటుగా, చీకాకుగా వుంది. కాని.........తప్పదు కదా! నాన్నగార్ని ట్రీట్ చేస్తున్నాడు—ఆ విషయంలో అభినందించ వలసిందే!

"శ్రీకాంత్‌ను వివాహం చేసుకొంటే, తిరిగి పట్నం పోవచ్చు. చదువును పునరుద్ధరింపవచ్చు. నాన్నగారికి వైద్యం కూడా బహుశః అతడే చేయగలడు. లేదా—అదృష్టం కొలదీ ఈ లోపునే అయినట్టు మనస్థిమితం చేకూరవచ్చు."

ఆలోచనలతో వుండగానే, వీధిలో శ్రీనగేష్ యింటి నుండి బండి వచ్చి ఆగింది. జయశ్రీ మేడమీదకు పరుగెత్తింది. "నాన్నా."మనం, ఒక్కసారి అలా డాక్టర్ గారింటికి వెళ్దాం రండి." అన్నది.

"ఎందుకు? తోచకపోతే నువ్వు వెళ్ళి రామ్మా. నేను రాను." అన్నాడు చంద్రంతో ఇష్టాగోష్ఠి సల్పుతున్న శ్రీపతి.

"అలా కాదు, రావాలి నాన్నా, ప్రత్యేకంగా ఏదోపని వున్నది. అవసరంగా రమ్మనమని శ్రీనగేష్ కబురంపారు. బండి కూడా వచ్చింది."

"ఎందుకై ఉంటుందమ్మా?" ఆలోచించ సాగాడు శ్రీపతి.

"పోనీ, చంద్రం కూడా మనతో వస్తాడులెండి." అన్నది జయశ్రీ.

"చిత్తం." అన్నాడు చంద్రం.

"సరే. వెళ్దాం." ఉత్సాహంగా అంగీకారం తెలిపాడు శ్రీపతి. "బహుశః అబ్బాయి దగ్గరనుండి ఏమైనా వార్త తెలిసి వుంటుంది. అందుకై వుండవచ్చు, నడవండి. త్వరగా వెళ్దాం."

'ఉస్సు' రంటూ కుర్చీలో కూలబడిపోయింది జయశ్రీ. "ఈయన కీ ధోరణి వచ్చేసింది భగవంతుడా." అనుకుంది నీరస స్వరంతో స్వగతంలాగా.

"లే అమ్మాయ్, లే. ఆలస్యం చేయకు." అన్నాడు శ్రీపతి పాదరక్షలు ధరిస్తూ.

"ఫర్వాలేదు. లేవండి. నేనూ వెంట వస్తున్నానుగా!" చంద్రం అభయమిచ్చాడు జయశ్రీకి, శ్రీపతి వినకుండా.

"సరే. కానున్నదేదో కాక తప్పదుగా?" అనుకుంటూ లేచింది జయశ్రీ.

"రండి. రండి."శ్రీపతి, జయశ్రీలకు స్వాగతం పలికాడు శ్రీనగేష్.

"ఏమండీ? ఏమిటి అవసరంగా కబురంపారట?" కూర్చున్నాక అడిగాడు శ్రీపతి.

"పెద్ద అవసరమేమీ లేదులెండి. చిన్నకారణమే. కూర్చోండి."

"ఏం, అబ్బాయి దగ్గిరనుండి ఏమైనా కబురు వచ్చిందా?"

"ఆ, వచ్చింది రండి, కూర్చోండి. చెప్తాను."

శ్రీదేవికూడా లోనుండి వచ్చి కూర్చున్నది. ఆమె ముఖం ఏదో ఆందోళనా, ఆగ్రహాన్ని ప్రయత్న పూర్వకంగా మరుగు పరుస్తున్నట్లు స్పష్టంగా ద్యోతక మౌతున్నది.

"వచ్చారామ్మా!" అని జయశ్రీని ముక్తసరిగా పలుకరించి అన్యమనస్కంతో మౌనంగా కూర్చున్నది.

శ్రీనగేష్ మాటి మాటికీ వీధిగుమ్మంలోకి వెళ్ళి చూచి వస్తూ, గదిలో గంభీరంగా పచార్లు చేస్తున్నాడు. చంద్రం, శ్రీపతి కూర్చున్న ఆసనం వరసనే నిలబడాడు. మరో నలుగురు పంచె కింద పుష్టిగా యువకులు గది నలుమూలల్లో చేతులు కట్టుకుని నిలబడ్డారు ఏదో ప్రత్యేక ఆజ్ఞ కొఱకై ఎదురు చూస్తూ స్తబ్దుగా.

శ్రీపతి గదిగోడలు పరికింపుతూ ఏదో ఆలోచనలో పడిపోయాడు.

ఆ గంభీరత్వాన్ని భరింపలేక జయశ్రీ తానే సంభాషణ ఉపక్రమించింది; హాలుమధ్యగా వేసివున్న తెరను చూపుతూ "అదేమిటల్లయ్యా? ఆతెర చాటున ఏమున్నది? ఇదివరకు ఏమి యున్నట్టు గుర్తులేదు. ఈమనుషులూ..గొడవ అంతా ఏమిటో ప్రత్యేకంగా కన్పిస్తున్నది నాకు."

"ఏమోనమ్మా!" అన్నది అన్యమనస్కంగా శ్రీదేవి.

"ఏమిటి బావా? ఏదో మాట్లాడతానని, అంత ఆలోచిస్తున్నావేమిటి?"

జయప్రశ్నవిని శ్రీనగేష్ పచార్లు ఆపుజేసి వచ్చి జయశ్రీకి సమీపంలో మరొక ఆసనంపై కూర్చున్నాడు. "మామయ్య మతి చాంచల్యం పోగొట్టే బాధ్యతను నువ్వు నాపైన వేశావు!" అన్నాడు గంభీరంగా ఆమె నేత్రాలలోకి చూస్తూ.

"అవును. అదేదో క్రొత్త విషయంలా మాట్లాడుతున్నావే!"

"క్రొత్తది కాదనుకో. కాని నీకొక విషయం స్పష్టీకరించక తప్పదు. ఇంత నిర్మొహమాటంగా మాట్లాడుతున్నందుకు నీకు కోపం రాకూడదు.

అతడి మాటలను మౌనంగా వింటున్నది జయశ్రీ.

"మామయ్యకు చికిత్సా విధానంలో నే ననుసరిస్తున్న వన్నీ క్రొత్తపద్ధతులూ, వింత పద్ధతులే. అందువల్ల ఆయన ఉన్మాదం తగ్గిపోగలదనే నా ఆశ. ఈ నా ప్రయత్నాలూ, పద్ధతులూ నీకు అయిష్టమైనా, బాధాకరమైనా సహించవలసినదే కాని, నాపై కోపం తెచ్చుకోవడంగానీ, మరెవరిపైనా నిందవేయడంగానీ చేయకూడదు నువ్వు."

"అంటే?" అనుమానం, ఆత్రం ధ్వనించాయి జయశ్రీ స్వరంలో.

## జరిగిన కథ

కారు యాక్సిడెంట్‌లో శ్రీపతి చిక్కుకుని మతి స్థిమితాన్ని కోల్పోతాడు. అతనితోపాటు జయశ్రీ తప్ప మిగిలిన వారంతా ఆ యాక్సిడెంట్‌లో చనిపోతారు. శ్రీపతి మేనల్లుడు శ్రీనగేష్ ఆయనకు చికిత్స చేస్తుంటాడు. ఆ చికిత్సావిషయంలో శ్రీలక్ష్మి అనే మెడికల్ స్టూడెంటు సహాయాన్ని శ్రీనగేష్ కోరుతాడు. అందుకు ఆమె అంగీకరించింది. కాని ఆమె బయలుదేరి రాబోయేముందు కాలు చెయ్యి విరిగి హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళాల్సి వచ్చింది.

నిర్మలంగా నవ్వాడు శ్రీనగేష్. "ఖంగారు పడకు జయా. నాపై పూర్తి నమ్మకముంచు. నీకు నేను ఉపకారం చేసేవాడినే కాని, అపకారం, అవమానం చేయనుకదా? నా మాటల అర్థం నీకు తర్వాత బోధపడుతుంది. ఇప్పుడింత కంటే వివరించను వీలు కాదు."

తలపంకించి ఊరుకున్నది జయశ్రీ.

"ఏమిటది? నాకు చెప్పరేం?" శ్రీపతి లేచివచ్చి శ్రీనగేష్ దగ్గరగా కూర్చున్నాడు.

"అయ్యో ఎందుకుచెప్పను? చెప్పడానికే కదండీ రప్పించినది!" నవ్వుతూ అంటున్న నగేష్, ఒక నౌకరు ఆత్రంగా పరుగెత్తుకువచ్చి గుమ్మంలో ఆగిపోవడంతో, లేచి వాడి దగ్గరగా వెళ్ళాడు. వాడు చెప్పిన విషయం వినగానే శ్రీనగేష్ ముఖం వికసించింది. ఇద్దరూ పదినిముషాలు ఏదో మాట్లాడుకున్నారు. అతడికి ఏవేవో హెచ్చరికలనిచ్చి 'ఓ అరగంటలో యిక్కడుండాలి!' అని చెప్పిపంపేసి, తిరిగివచ్చి శ్రీపతికి అభిముఖంగా కూర్చున్నాడు శ్రీనగేష్.

"చూడండి రావుగారూ, మీకు గతమంతా పూర్తిగా జ్ఞాపకముంటుందా?" అని శ్రీపతి వదనాన్ని పరీక్షగా పరికిస్తూ అడిగాడు.

"ఏం గుర్తులేక? నాకేమన్నా మతి మరపు రోగమనుకున్నావా? మతి భ్రమించిందనుకున్నావా?"

ఆ తీవ్రప్రశ్నకు శ్రీనగేష్ కంటె జయశ్రీ, శ్రీదేవిలు అమితంగా కలవరపడ్డారు.

అదేమీ గమనించనట్టే ముందుకు సాగిపోయాడు శ్రీనగేష్.

"మీ యిద్దరు అబ్బాయిలు ఎక్కడండీ ఉద్యోగం చేస్తూంటారు."

"ఇదేమిటయ్యా?" డాక్టర్‌నొక తెలివితక్కువ వాడిగా కట్టేసి పకపకా నవ్వేశాడు శ్రీపతి. "ఎన్నిసార్లు చెప్పాను నీతో, ఢిల్లీలో చేస్తున్నారని?"

"ఓహో!" తలపంకించి కొంటెంగా నవ్వు ఆపుకుంటూ ఉండిపోయాడు శ్రీనగేష్.

"చూడండి. ఆఖరుసారిగా మీ అబ్బాయిని మీరెప్పుడు చూశారు?" సూటిగా అతడి నేత్రాలలోనికి చూశాడు శ్రీనగేష్.

"అఁ!" ఆ ప్రశ్న వింటూనే శ్రీపతి ముఖకవళికలు చిత్రవిచిత్రంగా, వర్ణనాతీతంగా వెంట వెంటనే మారిపోసాగాయి.

"బావా!" కంగారుగా లేచి నిల్చుంది జయశ్రీ.

శ్రీనగేష్ అటు చూశాడు "భయంగా వుందా జయా? పర్వాలేదు. పోనీ లోపలికి వెళ్ళికూర్చోండి నువ్వూ, అమ్మానూ. తీసుకు వెళ్ళమ్మా జయను లోపలికి."

ఆ మాట అన్నదే తడవన్నట్లుగా శ్రీదేవి జయశ్రీ లిద్దరూ లేచి లోపలికి వెళ్ళిపోయారు.

పిచ్చి చూపులు చూస్తూన్న శ్రీపతి వైపు తిరిగి అన్నాడు శ్రీనగేష్ "ఆఖరు సారిగా మీరూ, మీ అబ్బాయీ ఏ పరిస్థితులలో విడిపోయారో మీకు గుర్తుందా రావుగారూ?"

తల విదిలించుతూ, చేతిలో కణతలు రుద్దుకుంటూ అటూ యిటూ అర్థరహితంగా చూడసాగాడు శ్రీపతి.

"మర్చిపోయారు కాబోలు! పోనీలెండి, పోనీ మీ అబ్బాయికి మీ రేమైనా పెళ్ళి ప్రయత్నాలు చేశారా?"

శ్రీనగేష్ మాట పూర్తి కాకుండగానే, అలా హఠాత్తుగా పెళ్ళి బాజా భజంత్రీలు మ్రోగ సాగాయి. హఠాత్తుగా హాలు మధ్యగా ఉన్న తెర లేచింది. అక్కడ వివాహ వేదిక చుట్టూ బ్రాహ్మణులు కూర్చుని మంత్రాలు వల్లె వేస్తున్నారు. హోమం ప్రజ్వరిల్లు తున్నది! అంతలో మెరపులాగా వచ్చి నిల్చుంది పెండ్లి కుమార్తె వివాహవేదికవద్ద!

అంతనూ తిలకించుచూన్న శ్రీపతి మస్తిష్కం, ముందుగా అయోమయమై పోయింది; కనులు విపరీతంగా చలించాయి. వేగంగా కొట్టుకుంటూన్న గుండెను సవరించు కున్నాడు. ప్రయ్యలై పోతూన్నట్లున్న తలను రెండు చేతులతో గట్టిగా పట్టుకున్నాడు. చూస్తూండగానే అతడి చూపులలో చపలత్వం మాయమైపోయి, తీక్షణత నిండుకున్నది.

పసుపు పచ్చని పట్టుచీర, మందార రంగు జరీఅంచు, అదే రంగు చోళీ, తలనిండుగా చామంతులు, తగినన్ని నగలతో నిండు అలంకరణతో సాక్షాత్తూ లక్ష్మీదేవిలా కదలక నిలబడిన శ్రీలక్ష్మిని చూస్తూనే శ్రీపతి నేత్రాలలో నెత్తురు జీరలు పేరుకున్నాయి. శూలాలవంటి చూపులు ఆమెను తినివేసేటట్లున్నాయి. పిడికిళ్ళు బిగిసి పోతున్నాయి. మనిషి నిలువెల్లా గజగజలాడిపోతూండగా అతడికి తెలియకుండానే ఒక్కొక్కమాటే బాధగా, బరువుగా, వాడిగా వెలువడ సాగింది:—

"అవును! ఇదే..... ఇదే......పిశాచి! ఆనాడు... ఇవేదుస్తులు.... ఇదేపిల్ల ...పెళ్ళి...మంత్రాలు....కట్నం...ఆ!! జ్ఞాపకం వచ్చింది!" భోరున ఏడ్చాడు శ్రీపతి. "నా కుమారుడిని తిరస్కరించి, చిదిమేసి, తినివేసిన రాక్షసి. పసుపు బొమ్మకాని భ్రమిసేను. యమదూత అని తెలుసుకోలేకపోయాను. దీని యింటినుంచి వివాహం తెగతెంపులై తిరిగి వస్తూనే......నా కారు టోల్తా పడింది. నా కుమారుడు, భార్య మాయమై పోయారు! చచ్చిపోయారు! చచ్చిపోయారు!! అయ్యయ్యో. చచ్చిపోయారు!!' హఠాత్తుగా వాయిద్యాలు, మంత్రాలూ ఆగిపోయిన నిశ్శబ్దంలో, అంతకంతకూ శ్రీపతి స్వరం తారస్థాయినందుకొంటున్నది.

శ్రీలక్ష్మి తనువెల్లా తుఫాను గాలిలోని చిగురుటాకులాగా వణికి పోసాగింది.

శ్రీనగేష్ వదనంలో సంతోష విచారాలు సమ్మిళితమై కన్పిస్తున్నాయి.

శ్రీపతి కంఠం నుండి పిడుగుల వాన వర్షించసాగింది. నేత్రాలు విస్ఫులింగాలను కురిపించు తూన్నవి. "నావాళ్ళను మింగి నన్ను సర్వనాశనం చేసిన పాతకీ! నిన్ను చంపి నా కక్ష తీర్చు కుంటాను." పైశాచిక ప్రవృత్తి విజృంభించిన శ్రీపతి కర్కోటక దృష్టులతో, రక్కసుని మాదిరిగా హస్తాలను ముందుకు చాచి దూకబోతున్నాడు.

వెంటనే శ్రీనగేష్ కంఠం బిగ్గరగా హెచ్చరించింది, గది మార్మోగేట్లు. "జాగ్రత్త!"

వెను వెంటనే మూల మూలలా సిద్ధంగా నిలబడివున్న నర్సూ, నౌకర్లూ మొదలైన వారంతా శ్రీపతిని చుట్టుముట్టి, బలంగాపట్టి ఎటూకదలనీయకుండా నిలబెట్టారు.

"రావుగారూ! అలామాట్లాడడం మంచిది కాదండి. కాస్త ఆలోచించండి." అని శ్రీపతికి నచ్చ జెప్పబోతూన్న చంద్రాన్ని వారించాడు శ్రీనగేష్.

"ఆ ఆవేశాన్నంతనూ అలా బయటకు వచ్చేయనీయి. అడ్డుపడకు."

ఇక ఎవరూ అతడి వాగ్ధోరణికి అడ్డుతగులలేదు. కొంత తడవు తిడుతూ, మరికొంతతడవు తనను తాను నిందించుకుంటూ, మధ్య మధ్య ఏడుస్తూ సాగిపోయింది శ్రీపతి ప్రలాపన.

ఇక శ్రీనగేష్ అతడి ధోరణిని పట్టించుకోలేదు. శిరస్సు పైనుండి పెద్ద భారం దిగిపోయినట్లుగా నిట్టూర్చుచూ ప్రక్కకు తిరిగాడు. లోగుమ్మంలో నిలబడి అంతా చూస్తూన్న శ్రీదేవి జయశ్రీలు కన్పించారతడికి. శ్రీదేవి వదనంలో ఆందోళనాశ్చర్యాలు.

జయశ్రీ నేత్రాలు నిప్పులు చెరగుతున్నాయి అది గమనించనట్లుగానే, "ఏమీ ఫర్వాలేదు. ఒక్క పావుగంట పోయాక ఆయనే స్థిమితపడ్తారు. అప్పుడు యింటికి వెళ్ళిపోవచ్చు. లోపలకూర్చో జయా." అంటూ, "ఆయనను అలాగే పట్టుకోండి. వదలవద్దు" అని మనుషులను మరోమారు హెచ్చరించి, శ్రీలక్ష్మి దిక్కుగా

విశ్రాంతిగా వెనక్కి వాలి కళ్ళు మూసుకు కూర్చున్న శ్రీలక్ష్మిని, "ఏమిటి జరిగిందండీ? మరీ అలా వున్నారేమిటి?" అని మెల్లగా ప్రశ్నించాడు శ్రీనగేష్.

నీరసంగా నవ్వి కళ్ళుతెరచి తిన్నగా కూర్చున్నది శ్రీలక్ష్మి

"సరిగ్గా మీవద్దకు రావలసినవేళకు మా అమ్మగార్ని హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళవలసి వచ్చింది........." అంటూ జరిగిన సంఘటనను క్లుప్తంగా చెప్పింది శ్రీలక్ష్మి "నాకు జ్ఞానం వచ్చిన తర్వాత ఇటువంటి అవసరా లెప్పుడూ కలుగక ఈ వైద్య శిఖామణుల స్వభావ ప్రవర్తనలను తెలుసుకొనే అవకాశం ఎప్పుడూ కలుగలేదు. మెడికల్ స్టూడెంటు నయ్యా. నేనే యింత అవస్థ పడితే ఇక చెప్పేదేముంది?"

"ప్చ్. మెడికల్ స్టూడెంటేమిటి-డాక్టర్నైన నేనుకూడా అంతే అనుభవించాలి. ఇతరుల అవసరముండి, ఆస్పత్రులలో అడుగుపెడితే పేషెంటుకు తీసిన ఎక్స్‌రే ఫోటో అసలు పేషెంటుకే యిచ్చెయ్యాల్సివున్నా పేషెంటుకు కాదుసరికదా-పేషెంటు తరఫున నేనడిగితే నాకుకూడా యివ్వలేదాఫోటో ఒక ఆస్పత్రిలో: మళ్ళీ నేను నా నర్సింగ్ హోమ్‌లో తీశాను! అలా ఏడుస్తున్నాయి ఆస్పత్రులలో అధిక సంఖ్య రూనాడు."

ఆశ్చర్యం కన్పించింది శ్రోతవదనంలో.

వత్తిరిగి అన్నాడు: "అయితే అన్ని ఆస్పత్రులూ, అందరు వైద్యులూ అలాగా వుండరు శ్రీలక్ష్మీ! మరీ కఠినమైన వ్యక్తులూ, అధ్వర్యం సరిలేని కొన్నికొన్ని సంస్థలూ అలా అధోగతిలో వుంటాయి. అంతమాత్రాన అన్నీ-అందరూ అలాగేవుంటారనుకోవడం తప్పు."

"అంత హోస్టీ జనరలైజేషన్ చేయడంలేదుకానీ, చాలా విసుగువచ్చి మీతో అమాత్రమైనా అన్నాను."

అంతలో ఏదో గుర్తుసచ్చినట్లు ఆత్రత వ్యక్తపరుస్తూ అన్నాడు శ్రీనగేష్. "అయితే కట్టు ఇంకా కట్టలేసన్నమాట?"

"లేదు. వదిలే ఇక చెప్పేదేమున్నది? చాలు ఉదరిచివర ఆపాను, ఇప్పుడు మీ హాస్పిటల్‌కు తీసుకవెళ్ళి కట్టాలి."

"అరరే! ఈ పరిస్థితులలో మీరు ఆమెనువదలి ఇక్కడకు వచ్చారా?" శ్రీనగేష్ కంఠస్వరంలో సానుభూతి!

"మరి మీకు మాటయిచ్చివున్నానుకదా? మీరు అన్ని ఏర్పాట్లూ చేసుకొని సిద్ధంగా వుంటారు. నేను మాట తప్పి మోసంచేస్తేఎలా?"

శ్రీనగేష్ పరిపూర్ణ సంతోష మానసంతో, ప్రఫుల్ల వదనంతో శ్రీలక్ష్మివైపు చూచాడు. మాటలకూ వర్ణనకూ అతీతమైన ప్రశంసా పూర్వక దృష్టులను ఆమెపైకి ప్రసరిస్తూ అన్నాడు. "మిమ్మల్ని మానవులనాలో, దేవతలనాలో తెలియకుండా వున్నది శ్రీలక్ష్మిగారూ. ఇంతటి అమృత హృదయురాలితో పరిచయమున్నందుకు అమితంగా ఆనందిస్తున్నాను."

నవ్వింది శ్రీలక్ష్మి. "నగమంతులుపడ్డు డాక్టరుగారు. మీకు నాపై అంత అభిమానంవుంటే చాలుగా........ అమ్మ ఒకవంక చేయి విరిగి బాధపడుతుంటే నేను లగ్నంగా పెండ్లి కుమార్తెలాగా ముస్తాబవ్వటం-మనస్సులో కొంతకష్టమే అన్పించిందనుకోండి. కాని ఏంచేస్తాం? ఒక్కొక్కసారి జీవితంలో అలా అగ్నిపరీక్షలు ఎదురౌతాయి. వాటిలోనే మనం నిగ్రహించుకోగలగాలి."

అత్యంత గౌరవపూర్వయుతా భావాలతో నిండిపోయిన శ్రీనగేష్ మాటలలో వినయవినమ్రతలు వ్యక్తమయ్యాయి. పరిపూర్ణ స్నేహ సౌహార్ద్రత నిండిన ఆవిడ కనులు అపరిమితమైన ప్రశంసలను మౌనంగానే ప్రతిసరిస్తుండగా విలువైన-బరువైన నిట్టూర్పు వెలువడింది.

మరి సంభాషణ కొనసాగకుండగానే కారు ఊరిశివార్లను చేరి, సుశీలాదేవి ఉన్నకారుపట్ట ఆగింది.

అతి నీరసంగా వున్న సుశీలాదేవినిచూచి శ్రీనగేష్ ఆశ్చర్యం ప్రకటించకుండా వుండలేక పోయాడు. "అరె. ఇంత నీరసంగావుంటే బలానికి ఒక ఇంజక్షన్‌కూడా చేయలేదా?" అంటూ తనమెడిసిన్ పెట్టెతెరచి ఇంజక్షన్ చేశాడు.

శ్రీలక్ష్మిని పరీక్షగా చూస్తూ ప్రశ్నించింది సుశీలాదేవి. "నువ్వు వెళ్ళేసరికి డాక్టరుగారు యింటిదగ్గరలేరా అమ్మాయీ?"

"ఆ! ఉన్నారు...... అదం......లేదమ్మా" అంటూ తడబడింది శ్రీలక్ష్మి.

"నడవండి. వెంటనే హాస్పిటల్‌కు వెళ్ళిపోదాం." అంటూ త్వరపెట్టాడు శ్రీనగేష్.

నీరసంగావున్నా స్థిరంగా పలికింది సుశీలాదేవి గొంతు "మరేమీ ఫర్వాలేదు. ప్రాణంపోయినా పోయినా ఫర్వాలేదు. కాని పరువే పోయిందని బాధగావున్నది." ఆమె చూపులు కుమార్తె వదనాన్ని, మాటలు హృదయాన్ని శూలాలై తాకాయి.

"అమ్మా!" అర్థంకాని సంమోహయంతో తల్లి చేతులు పట్టుకొన్నది శ్రీలక్ష్మి.

"ఛ భ్రష్టురాలా! ఇదేం ఖర్మనీకు? ఎవడినో దొంగ పెళ్ళి చేసుకోవలసిన అవసరమేమొచ్చింది నీకు? పని వున్నదని చెప్పి నువ్వు నన్ను మోసగించి తిరిగే తిరుగుళ్ళు యివన్నమాట? ఈ దొంగ పెళ్ళికోసం నన్నిలా ఊరి చివర దిక్కుమాలిన స్థితిలో వదిలేసి పోవడానికి నీకు మనసెలా ఒప్పింది? ఛీ ఛీ పాతకీ...."

సాగిపోతూన్న సుశీలాదేవి నిందా ప్రవాహాపు మూలకారణం గ్రాహ్యమైన జయశ్రీ, శ్రీనగేష్ లిరువురూ అప్పటికి తమ పొరపాటునూ, తొందర పాటునూ గ్రహించారు. ఒకరితో ఒకరు కండ్లతోనే మాట్లాడుకున్నారు.

కర్తవ్యాన్ని నిముషాలలో స్ఫురింప జేసుకొన్న శ్రీనగేష్ కల్పించుకున్నాడు. "క్షమించండి. మీరంత ఆగ్రహ పడవద్దు. మీ అమ్మాయిగార్ని గురించి మీ కంటె నాకు బాగా తెలుసని చెప్పడం

లేదుకాని—ఈ ప్రపంచంలో ఆమెలాంటి వాళ్ళు ఉన్నారనిపిస్తే సూర్యచంద్రులే గతులు తప్పుతారు.''

కన్నడమ్మాయి గురించి ప్రశంసావాక్యాలు విన్న సుశీలాదేవి వదనంలో అప్రసన్నత తొంగిచూసింది. ఆమె మనస్సు పూర్తిగా అసూయ నిరాశల మయం కాదు.

మెల్లని స్వరంతో అన్నాడు శ్రీనగేష్. ''నేను సుశీ చెప్పకుండా ఒక పనిచేశాను. క్షమించాలి. ఈ విషయంలో శ్రీలక్ష్మి గారి చేత తప్పనిసరిగా ఆవేషం ధరింప జేయాల్సివచ్చింది. అంతే. అంతకన్నా మరేం లేదు. నువ్వు తర్వాత అన్నీ వివరించగలను. ఇప్పుడు మాత్రం మరి పట్టు పట్టకండి. త్వరగా హాస్పిటల్‌కు పోయి మీ నేల విషయం చూడండి."

సుశీలాదేవి స్వరం కటువుగా పలికింది. ''సరే ఇంత ఆలస్యమెటూ అయ్యింది. మరో పది నిముషాలకేమీ పర్వాలేదు. వెళ్ళి ఆవేషం మార్చి సాదాగా రా. మనం వచ్చింది వైద్యానికి; పోతున్నది ఆసుపత్రికి!''

శ్రీలక్ష్మి నిస్సహాయంగా నిలబడి పోయింది.

నగేష్ గాడుపడినప్పటికీ, ఒక విధంగా సంతోషించాడు అవసరమైన పద్ధతుల్లో గల ఆమె పెంపకానికి. "నిజమే మీరన్నట్లు యింత ఆలస్యం ఎలాగూ అయ్యింది. మరో పావుగంట మేమీ పర్వాలేదు.'' అంటూ శ్రీలక్ష్మి వైపుచూచి ''ఇదిగో. ఇవన్నీ మాపొలాలే. ఆ కన్పించే షెడ్‌లోకి వెళ్ళి దుస్తులు మార్చుకుని ముందు తిరిగొచ్చేయండి.'' అన్నాడు.

కారులోవున్న చిన్న సూట్‌కేస్ తీసుకుని మారు మాట్లాడకుండా వెళ్ళిపోయిన శ్రీలక్ష్మి పది నిముషాలకే తిరిగి వచ్చింది. సాధారణ దుస్తులతో-అలంకారం విసర్జనతో.

'సౌందర్యం ఏరీతిలో ఎలా వున్నా దాగదు. సుమ పరిమళం గుబాళించినట్లే, అందాల కాంతి పుంజాలు సర్వత్రా ప్రకాశిస్తూనే వుంటాయి!' అనుకుంటూ కారు స్టార్టు చేశాడు శ్రీనగేష్ అతిసాదాగావున్న శ్రీలక్ష్మినిచూచి.

(సశేషం)

---

## మూడు పూవులూ-ఆరు కాయలుగా రాష్ట్రంలో

# చలన చిత్ర పరిశ్రమ



కొండా లక్ష్మణ్ బాపూజీ

చలన చిత్ర నిర్మాణములో భారతదేశం నేడు ప్రపంచంలోని అగ్రగామి దేశాలలో ఒకటిగా గుర్తించబడుతున్నది. వైశాల్యమూ, వైవిధ్యమూ, ప్రశస్తమైన సంస్కృతి, నాగరికత, పురాతన చరిత్ర, సంప్రదాయాలు కల భారతదేశం చలనచిత్ర నిర్మాణ ప్రగతికి బహుముఖాల దోహదకరంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. ఇటీవలి కాలంలో యీ రంగంలో దేశంలో సాధించబడిన ప్రగతి ప్రశంసార్హమైనది. ఈనాడు ప్రపంచ చలనచిత్ర నిర్మాణ ప్రసక్తి వచ్చినప్పుడు భారత దేశంలో జరిగిన కృషి ప్రముఖంగా కనిపిస్తూనే వుంటుంది.

భారతీయ సంస్కృతి మూడుపూవు లారుకాయలై వికసించి ప్రకృతి సౌందర్య విలసితమైన దక్షిణ భారతదేశంలో చలనచిత్ర పరిశ్రమ బాగా అభివృద్ధి పొందింది. సుమారు ముప్పదేండ్ల క్రితం చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధి పొందుతూవున్న ఆరంభ దశలో అనేక మంది ప్రముఖ ఆంధ్ర కళాకారులు సినిమా పరిశ్రమాభివృద్ధికి ఎంతో చేయూత యిచ్చారు. వారిలో చాలా మంది ఇప్పటికీ యువ కళాకారులలో నూతన చైతన్యం ఉద్దీపింప చేస్తూ కళాభివృద్ధికి పాటుపడుతున్నారు. కథాచిత్రాల నిర్మాణంతో దక్షిణ భారత దేశం సముచిత స్థానాన్ని పొందింది. 1965 లో దేశంలో నిర్మించబడిన 286 చిత్రాలలో తెలుగు చిత్రాలు 60, తమిళ చిత్రాలు 56. నిర్మాణ సంఖ్యలో తమిళ చిత్రాలు ద్వితీయ స్థానము, తెలుగు చిత్రాలు తృతీయ స్థానము అలంకరించినవి. హిందీకి ప్రథమ స్థానము లభించింది. ఆయేడు హిందీభాషలో 107 చిత్రాలు నిర్మించారు. తగిన ప్రోత్సాహమూ, సౌకర్యములూవుంటే తెలుగు చిత్రాలేగాక ఇచ్చటి హిందీ చిత్రాలు కూడా భారతదేశంలో ఇతోధిక ప్రాధాన్యము సాధించగలవనడంలో సందేహం లేదు.

## నిర్మాణ కేంద్రాలు

భారత దేశంలో చలన చిత్ర నిర్మాణం ప్రారంభమైన తర్వాత అనేక కారణాల వల్ల బొంబాయి, కలకత్తా, మద్రాసు మొదలగు నగరాలు చలన చిత్ర నిర్మాణ కేంద్రాలుగా వృద్ధి పొందినవి. ఈపరిశ్రమ ఇటువంటి కేంద్రాలలోనే కేంద్రీకృతమై

> ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి ఒక సహజమైన ఆకర్షణ వున్నది. అసంఖ్యాకములైన పవిత్ర క్షేత్రాలు, దేవాలయాలు, మసీదులు, సహజ సుందరమైన సరస్సులు వున్నాయి. పశ్చిమ గోదావరి జిల్లాలోని కొల్లేరు, వరంగల్లు జిల్లాలోని పాకాల సరస్తీరాలలో రకరకాల పక్షుల, మృగాల స్థావరాలు వున్నాయి. ఇవన్నీ మన చలన చిత్ర సీమను అలంకరించదగిన మనోహర దృశ్యాలు.

పోవడానికి బదులుగా విభిన్న ప్రదేశాలకు వ్యాపించవలసిన అవసరాన్ని ఇటీవల గుర్తించడం జరుగుతున్నది. దేశంలో రాష్ట్రాల పునర్నిర్మాణం తరువాత ఏర్పడిన వివిధ రాష్ట్రాలకు; దక్షిణాదిలోనే సుందర నగరం హైద్రాబాదు రాజధానిగాగల ఆంధ్రప్రదేశ్ యీ విషయంలో మార్గదర్శకత్వం వహించడం సహజమైన, సమంజసమైన చర్య.

## స్థిరమైన పునాదులు

సినిమా పరిశ్రమకు హైదరాబాదు నగరంలో స్థిరమైన పునాదులు ఏర్పాటు చేయడానికై ప్రభుత్వం గత మూడు నాలుగేండ్ల కాలంలో కొన్ని ముఖ్యమైన చర్యలు తీసుకున్నది. ఏటేటా చలన చిత్రాలకు బహుమతులు ఇచ్చి ప్రోత్సహించే పథకం, చలన చిత్ర నిర్మాతలకు విరివిగా ఋణాలు సబ్సిడీలు మంజూరు చేసే కార్యక్రమం ప్రారంభించినది. యీ సంకల్పంతోనే నగరంలో సమస్త సౌకర్యాలు కలిగిన చిత్రనిర్మాణ శాలలు ఏర్పాటవుతున్నవి. పైగా మన ప్రభుత్వం కల్పించిన, కల్పించ దలచిన వివిధ సౌకర్యాలను సద్వినియోగ పరుచుకొని పరిశ్రమాభివృద్ధి చేయడానికి అనేకమంది పేరు ప్రతిష్ఠలుగల సుప్రసిద్ధ చలన చిత్ర నిర్మాతలు ముందుకు రావడం కూడా జరుగుతున్నది. ఇది మన రాష్ట్ర ప్రజలందరూ హర్షించదగిన పరిణామం.

ఏటేటా కథా చిత్రాలకూ, డాక్యుమెంటరీ చిత్రాలకూ, పిల్లల చిత్రాలకూ, వైజ్ఞానిక చిత్రాలకూ విడివిడిగా ప్రభుత్వం

పేరుతో బంగారునంది, వెండినంది, కంచునంది పురస్కారాలను ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగా యివ్వడం 1961 నుండి అమలు జరుగుతున్నది. 1966 ఆగస్టు 15న జేసిన 1964 సంవత్సరపు బహుమతి ప్రదానం జరిగింది. అలాగే గత సంవత్సరం మార్చి నెలలో 1965 సంవత్సరానికి బహుమతులు యిచ్చారు. 1966లో నిర్మించిన చిత్రాలలో ఉత్తమమైనవిగా ఎన్నికైన వాటికి బహుమతి ప్రదానం ఏప్రిల్‌లో జరిగింది.

### "సినీ కాలనీ"

స్టూడియో ల స్థాపనకై సారథీ స్టూడియోస్‌కు రెండున్నర లక్షల రూపాయల ఋణాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. నటరత్న మూవీటోన్ స్టూడియో విస్తరణార్థం రెండున్నర లక్షల రూపాయల ఋణం యివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ప్రసాద్ ప్రొడక్షన్స్ వారికి క్రొత్తగా స్టూడియో నిర్మించుకోడానికి 5 లక్షల రూపాయల ఋణం యివ్వాలనికూడా నిశ్చయింపబడింది. సినిమా స్టుడియోలతో సహా ఒక "సినీకాలనీ" నిర్మించ డానికై హైదరాబాదు సమీపంలో 200 ఎకరాల భూమిని ప్రభుత్వం కేటాయించింది. ఫిలిం నిర్మాతల వద్దనుండి ప్రతిఫలం తీసుకుని యీ భూమిని వారికి కేటాయిస్తారు. ముమ్ముంతు యీ "సినీ కాలనీ" భారతదేశంలో ఒక ప్రధానమైన చలనచిత్ర కళా కేంద్రంగా అభివృద్ధి చెందడానికి అవకాశాలు వున్నవి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో నిర్మించబడిన ఏ చలన చిత్రానికైనా 50 వేల రూపాయలు సబ్సిడీ కూడా ప్రభుత్వం మంజూరు చేస్తుంది. ఇంతవరకు యీ విధంగా 11 చిత్రాలకు 50 వేల వంతునా, ఒక చిత్రానికి 25 వేల రూపాయలు సబ్సిడీ లభించింది. ఇంకా 7 చిత్రాలకు సంబంధించి వచ్చిన దరఖాస్తులను ప్రభుత్వం పరిశీలిస్తున్నది. పరిశ్రమ అభివృద్ధి పొందడానికి తగిన యోగ్యతలు సాంకేతిక పరిజ్ఞానం కల సిబ్బంది చాలా అవసరం. అందువల్ల యీ సందర్భంగా పూనాలోని ఫిలిం ఇన్‌స్టిట్యూట్ వారు కల్పించిన సౌకర్యాలను మనము పూర్తిగా వినియోగించుకుంటున్నాము. 1965_66 సంవత్సరంలో పూనా సంస్థలో సాంకేతిక శిక్షణ పొందుతున్న నలుగురు అభ్యర్థులకు ఒక్కొక్కరికి సంవత్సరానికి రెండు వేల రూపాయలు స్కాలర్‌షిప్ మంజూరు చేయడం జరిగింది. 1966_67 సంవత్సరానికి కూడా ఇద్దరు అభ్యర్థులకు యీ స్కాలర్‌షిప్ కొనసాగించడం జరుగుతున్నది. ఇంతే కాక 1966_67 సంవత్సరానికి ఆరుగురు అభ్యర్థులకు ఆరు విషయాలలో శిక్షణ పొందుటకై సంవత్సరానికి 12 వందల రూపాయల వంతున స్కాలర్‌షిప్‌లు మంజూరు చేశారు. నాల్గవ ప్రణాళికా కార్యక్రమంలో భాగంగా హైదరాబాదులో ఒక ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ నిర్మించే తలంపు కూడా వున్నది. ఈ ప్రతిపాదన సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరు పరిశీలనలో వున్నది.

ఈ విధంగా రకరకాల సౌకర్యాలు కల్పించడంవల్ల చలన చిత్ర నిర్మాతలను విరివిగా మన రాష్ట్రంలోకి ఆకర్షించడానికి చక్కని అవకాశం ఏర్పడుతుంది. అంతేకాక ప్రకృతిమాత ప్రసాదించిన మనోహర సుందర దృశ్యాలతో బహువిధ శిల్పకళా విన్యాసానికి పేరెన్నికగన్న పురాతనాధునిక నిర్మాణాలతో ప్రసిద్ధి చెందిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఒక సహజమైన ఆకర్షణ వున్నది. అసంఖ్యాకములైన పవిత్ర క్షేత్రాలు, దేవాలయాలు, మసీదులు, సహజసుందరమైన సరస్సులు వున్నవి. పశ్చిమ గోదావరి జిల్లాలో కొల్లేరు, వరంగల్ జిల్లాలోని పాకాల సరస్సీరాలలో రకరకాల పక్షులు, మృగాల స్థావరాలు వున్నాయి. యివన్నీ మన చలనచిత్ర సీమను అలంకరించదగిన మనోహర దృశ్యాలు. ఇంకా నీటి పారుదల, విద్యుచ్ఛక్తి రంగాలతో నిర్మించబడుతున్న బహుళార్థ సాధక ప్రాజెక్టులు, అక్కడి విశేషాలు వంచరంగుల డాక్యుమెంటరీ చిత్రాలు తీయడానికి ప్రజలను ఉత్తేజ పరచడానికి చక్కగా ఉపకరించ గలవు కూడా.

సినిమా పరిశ్రమాభివృద్ధి రంగంలో మనం తీవ్రంగా ఆలోచన చేయవలసిన మరొక ముఖ్యాంశ మున్నది పిల్లలకు సంబంధించిన చలన చిత్ర నిర్మాణ కార్యక్రమం మన దేశంలో చాలా వెనుకబడి ఉన్నది. 1965లో దేశంలో నిర్మించబడిన చిత్రాలలో ప్రథమస్థానం సాంఘిక చిత్రాలకూ, రెండవ స్థానం నేరములకు సంబంధించిన కథా చిత్రాలకూ, మూడవ స్థానం అభూత కల్పనా చిత్రాలకూ వచ్చింది. మన దేశంలో నిర్మింపబడిన పిల్లల చిత్రాల సంఖ్య నిరాశా జనకంగా వుంది. పశ్చిమ దేశాల్లోనూ, జపాను వంటి ప్రాచ్య దేశాల్లోనూ పిల్లల చిత్రాలకు ఎంతో ప్రాధాన్యం యిస్తారు. ఎందుకంటే సినిమా అనేది ఆధునిక యుగంలో శక్తివంతమైన ప్రచార సాధనంగా రూపొంది నందువల్ల భావి పౌరులైన బాలబాలికలకు దీని ద్వారా విద్యా, విజ్ఞానదాయకమైన అభిరుచులు కల్పించాలని ఆదేశాలలోని వారు నిశ్చయించు కొన్నారు. ఈ నాడు మన దేశంలోని విద్యార్థుల్లో తల యెత్తుతున్న రకరకాల విపరీతపు పోకడలకు ముఖ్యంగా శీలరాహిత్యమే ప్రధానమైన కారణముగదా. చిన్న తనము నుండియే బాల బాలికలు శీలమును సరియైన త్రోవలో పెంపొందించుటకు తగిన విధంగా పిల్లల చలన చిత్రాలను నిర్మించి తద్వారా వారిలోని మంచినీ మానవత్వాన్ని అభివృద్ధిపరచవచ్చు. వారు భవిష్యత్తులో సత్పౌరులై దేశ శ్రేయస్సుకు కృషి చేయగల సమర్థులుగా తీర్చిదిద్దవచ్చు.

ఈ నాడు ఆధునిక శాస్త్రీయ విజ్ఞానమూ, సాంకేతిక పరిజ్ఞానమూ మానవుడి కృషికి సంబంధించిన ప్రతిరంగంలోనూ త్వరితగతిలో వృద్ధి పొందుతూ వున్నవి. చలన చిత్ర పరిశ్రమ రంగం కూడా వేగంగా ప్రగతి సాధించడానికి ప్రయత్నం చేస్తున్నది. 'విస్టా విజన్' వంటి విదేశ సాంకేతిక విజ్ఞాన ప్రయోగాలను మనం కూడా మన ప్రాంతంలో చేసుకోవచ్చు. అదే విధంగా రంగుల చిత్రాలు కూడా ప్రజారంజకంగా ఆకర్షణీయంగా ఉంటాయి. ఆంధ్రప్రదేశ్‌లోని చిత్ర నిర్మాతలు కూడా ఈ నూతన ప్రయోగాలను ఎక్కువగా చేపట్టి సత్ఫలితాలు పొందుతారని నేను మనస్ఫూర్తిగా విశ్వసిస్తున్నాను. ముఖ్యంగా ప్రణాళికా పథకాలకు సంబంధించిన డాక్యుమెంటరీ చిత్రాలు నిర్మించినపుడు వాటిలో యీ నూతన సాంకేతిక విషయాలను ప్రవేశపెడితే ప్రజల మనస్సుల మీద గాఢమైన ముద్రవేయడానికి చక్కని అవకాశం వుంటుంది.



కన్నుల పండువుగా జరిగిన

# నంది బహుమతుల ప్రదానోత్సవం

రాష్ట్రప్రభుత్వ నంది బహుమతుల ప్రదానోత్సవం రవీంద్ర భారతిలో ఏప్రిల్ 19న కన్నుల పండువుగా జరిగింది. రంగులరాట్నం, చిలకా గోరింక, ఆస్తిపరులు చలనచిత్రాలకు బహుమతులు అందజేసే ఈ ఉత్సవం అత్యంత ఆకర్షణీయంగా జరిగింది. ఆనాటి ఉత్సవ విశేషాలను తెలియజేసే ఫోటోలను కొన్నిటిని యిక్కడ ప్రచురిస్తున్నాం.

ఒక పెద్ద చలనచిత్ర నిర్మాణ కేంద్రంగా హైదరాబాదు నగరం శీఘ్రగతిని అభివృద్ధి చెందుతున్నది. ఉత్తమ చిత్రాలకు బహుమతులను యిచ్చే రాష్ట్రప్రభుత్వ విధానం యిందుకు ఎంతగానో తోడ్పడుతున్నది



సినీకళాకారులు ఏప్రిల్ 18 న హైదరాబాదుకు విచ్చేసినప్పుడు బేగంపేట విమానాశ్రయంలో వారికి స్వాగతంపలికినప్పటిచిత్రం



బహుమతి నిర్ణేతలు: న్యాయమూర్తి శ్రీ శేషాచలపతిరావు శ్రీ ఎ. వి. భద్రరావు, శ్రీ కె. వి. గోపాలస్వామి. శ్రీ వి. వి. మాణిక్యాలరావు



ఉత్తమ చలన చిత్రంగా ఎన్నికైన 'రంగుల రాట్నం' చిత్రాన్ని నవరంగ్ థియేటరులో ప్రదర్శించిన సందర్భంలో కళాకారులను పరిచయం చేస్తున్న చలన చిత్ర పరిశ్రమ సహాయ కార్యదర్శి శ్రీ వి. వి. మాణిక్యాలరావు



ఆ సందర్భంలో ప్రసంగిస్తున్న ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఎన్. అనంతరామన్: ఐ. సి. ఎస్.



సమాచార, పౌర సంబంధ శాఖ డైరెక్టర్ శ్రీ బి. ఆర్. కె. శాస్త్రి వందన సమర్పణ చేస్తున్న దృశ్యం



ముఖ్యమంత్రి వద్ద నుండి ప్రభుత్వ చిహ్న ఫలకాన్ని అందుకుంటున్న కుమారి విజయనిర్మల



'రంగుల రాట్నం' చిత్రానికి బంగారు నంది బహుమతిని అందుకుంటున్న చిత్ర నిర్మాత, దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి



ప్రభుత్వ చిహ్న ఫలకాన్ని స్వీకరిస్తున్న శ్రీమతి అంజలీదేవి



ప్రభుత్వ చిహ్నఫలకాన్ని గ్రహిస్తున్న చంద్ర మోహన్



ఉత్తమ చలన చిత్ర కథారచయితగా 'రంగుల రాట్నం' రచయిత శ్రీ పాలగుమ్మి పద్మరాజు ప్రభుత్వ చిహ్న ఫలకాన్ని, చెక్కును స్వీకరిస్తున్న దృశ్యం



'చిలకా గోరింక' చిత్రానికి రజత నందిని స్వీకరిస్తున్న
శ్రీ ప్రత్యగాత్మ



ఆస్థిపరులు నిర్మాత శ్రీ వి. రాజేంద్రప్రసాద్ కాంస్య నందిని
స్వీకరిస్తున్న దృశ్యం



ప్రభుత్వ చిహ్నఫలకాన్ని స్వీకరిస్తున్న ఎస్. వి రంగారావు



ఆస్థిపరులు దర్శకుడు శ్రీ మధుసూదనరావు ప్రభుత్వ చిహ్న
ఫలకాన్ని స్వీకరిస్తున్నప్పటి చిత్రం



ప్రభుత్వ చిహ్న ఫలకాన్ని అందుకుంటున్న కృష్ణకుమారి



ప్రభుత్వ చిహ్న ఫలకాన్ని స్వీకరిస్తున్న శ్రీ ఎ. నాగేశ్వరరావు



ప్రభుత్వ చిహ్నఫలకాన్ని స్వీకరిస్తున్న శ్రీమతి జి. వరలక్ష్మి



శ్రీ కె. జగ్గయ్య ప్రభుత్వ చిహ్న ఫలకాన్ని స్వీకరిస్తున్న దృశ్యం



ప్రభుత్వ చిహ్నఫలకాన్ని అందుకొంటున్న శ్రీ కృష్ణంరాజు



ఆనాటి ఉత్సవానికి విచ్చేసిన కొందరు ప్రముఖులు

# మహాభారతము

పప్పుగంటుల లక్ష్మణశాస్త్రి

ఆ మాటలు విని అర్జునుడు, 'గంధర్వరాజా! నేను నీకు ప్రాణదాత నని నీ వొకవేళ నాకు విద్య, ధనము ఇచ్చుచున్నచో అట్టిది నాకు అక్కరలేదు." అనెను. దానికి గంధర్వు డిట్లనెను. "అర్జునా! మహాపురుషులసాంగత్యమే ప్రీతికర మగును. ఇదిగాక నీవు నాకు జీవనదాత వగుదువు. కనుక ప్రసన్నుడనై నేను నీకు 'చాక్షుషీ' విద్య నిచ్చితిని. నీనుండికూడ నేను ఆగ్నేయాస్త్రమును గ్రహించెదను. ఈ విధముగా మనయిరువురకు మైత్రి చాలకాలమువరకు నిలుచును."

ఆమాటకు అర్జునుడు సంతసించి ఆగ్నేయాస్త్రము నతని కిచ్చి అతనివిద్యను, అశ్వములను గ్రహించెను. పిదప అర్జునుడు 'గంధర్వరాజా! మనుష్యుల మైన మేము వేద వేదాంగములు నేర్చినవార మైనను, శత్రు సంహారము చేయువార మైనను గంధర్వు లగుమీనుండి యేల భయపడుచున్నాము? మీభయముచేత రాత్రి యేల సంచరించ జాలకున్నాము? చెప్పుము.'' అని అడిగెను గంధర్వు డిట్లు చెప్పెను;—

"పాండుకుమారులారా! మీరు వివాహితులు కానందు వలన త్రేతాగ్నులను సేవించ లేదు. ప్రతిదినము అగ్నితో హోమముగూడ చేయరు మీకు అగ్రభాగములో పురోహితు డగు బ్రాహ్మణుడుగూడ లేడు. ఈ కారణములచేత నేను మీపైన ఆక్రమణము చేసితిని. యక్షులు, రాక్షసులు, గంధర్వులు, పిశాచములు, నాగులు, దానవులు మీ కురుకులమును కీర్తించు చుందురు. నారదాదిమహర్షులు మీ కులమును పొగడు చుందురు. నేను గూడ భూమండలములో తిరుగునప్పుడు మీకులప్రశస్తి నెరుగుదును. మహామహు డగు ద్రోణుడు మీకు ఆచార్యుడు. మీతండ్రులు చాల గొప్పవారు. మీ యన్నదమ్ములుగూడ సత్ప్రవర్తన గలవారు. ఇంత ఉత్తము లని తెలిసికూడ నేను మిమ్ము ముట్టడించితిని. దానికి కారణము, నేను స్త్రీలతో విహరించు చుంటిని. ఎంత హీను డైనను స్త్రీలయెదుట తనప్రభావమును ప్రకటించ దలచును. ఇది గాక రాత్రులయందు మాకు శక్తి యెక్కువ. ఇట్లున్నను, నీచేత నేను ఓడుటకు కారణ మే మనగా, నీవు నిత్యబ్రహ్మచర్యవ్రతము గలవాడవు. కాంతల మోహములో పడినక్షత్రియు డెంత బలశాలి యైనను వాడు రాత్రి యుద్ధములో నాచేత చచ్చి యుండును. కామవృత్తిలో నున్న వాడుగూడ సద్బ్రాహ్మణుని ముందిడుకొని వచ్చినచో ఆబ్రహ్మ తేజమునకు నేను లొంగి యుందును. ఎందు కనగా, ఆ పురోహితునిపైననే క్షత్రియుడు తనరక్షణభార మంతయు వైచి యుండును. కనుక తాపత్యకుల్లాంకారా! మానవు లీలోకములో ఏమంచి పనిచేయ దలచినను, శాంతుడు, (మనోనిగ్రహము గలవాడు.), దాంతుడు (బహిరింద్రియనిగ్రహము గలవాడు) నగుబ్రాహ్మణుని పురోహితునిగా నుంచు కొనవలెను. వేదశాస్త్రపారంగతులై, సత్యవాదులై, మనశ్శుద్ధిగలవారై, ధర్మాత్ములై మనోనిగ్రహము గలవారైన బ్రాహ్మణులే రాజులకు పురోహితులుగా నుండ దగినవారు. అట్టి బ్రాహ్మణుడు పురోహితుడుగా గలరాజునకు ఈ లోకములో జయము, పరలోకములో స్వర్గము సిద్ధ మగును. అలభ్యవస్తువును సంపాదించుటకు గాని, సంపాదించినదానిని రక్షించుటకు గాని రాజు సద్గుణవంతు డగు విప్రుని పురోహితునిగా జేసికొన వలెను. తనశ్రేయస్సును గోరి, సమస్తభూమండలమును పాలించ దలచురాజు పురోహితుని యాజ్ఞప్రకారము నడచుకొనవలెను. అర్జునా! ఏరాజుగూడ పురోహితునిసహాయము లేక కేవలము తన శరీరబలముచేతను, కులీనత్వముచేతను శత్రువులపైన విజయమును సాధించ లేడు. కనుక తాపత్యా! ఎచ్చట బ్రాహ్మణులకు ప్రాముఖ్యము ఉండునో ఆ రాజ్యమే చాలకాలమువరకు రక్షింప బడు నని తెలిసికొనుము.

అర్జునుడు చిత్రరథునితో నిట్లనెను. '' గంధర్వరాజా! నీవు మాటి మాటికి నన్ను ' తాపత్యా ' !అని సంబోధించితివి, దాని యర్థమేమి? తపతి యెవరు? కౌంతేయుడ నగు నేను ఆమె కెటు సంతానమైతిని? తెలుపుము.''

ఆ మాటకు చిత్రరథుడు ఆకథ నిట్లు చెప్పెను—

## తపతీ సంవరణోపాఖ్యానము

సూర్యునకు ' తపతి ' యను కూతురు ఉండెను. ఆమె తండ్రి వలెనే తేజశ్శాలినిగ నుండెను. ఆమె సావిత్రీదేవికి

చెల్లెలు. అత్యంత తపస్విని గనుక 'తపతి' యను పేరు వడసెను. మూడు లోకములలో అంతటి సౌందర్యవతి లేకుండెను. ఆమెకు యౌవనము వచ్చెను. తగిన వరున కిచ్చి వివాహము చేయుటకు సూర్యుడు చింతించుచుండెను. ఆ సమయమందే, కురుకులతిలకుడగు 'ఋక్షుడను' రాజునకు పుత్రుడగు 'సంవరణుడు' సూర్యు నారాధించుచుండెను. అతని భక్తికి సూర్యుడు మిగుల సంతోషించెను. ఆ రాజపుత్రుడు అతిధర్మజ్ఞుడేకాక అతిలోకసౌందర్యవంతుడుగాగూడ నుండెను. ఆకాశములో సూర్యునివలె భూమిలో సంవరణుడు ప్రకాశించుచుండెను. బ్రహ్మజ్ఞులు సూర్యు నారాధించినట్లు, క్షత్రియాది ప్రజలు సంవరణు నారాధించిరి. సూర్యుడు సంవరణునకే తపతి నిచ్చి వివాహము చేయ సంకల్పించెను.

సంవరణుడొకనాడు పర్వత ప్రాంతవనమునందు వేటాడుచు తిరుగుచుండెను. ఆకలిదప్పులకు తాళలేక అతనిగుఱ్ఱము చచ్చెను. అతడు పాదచారిగనే పర్వతమునందు తిరుగుచు అత్యంత రూపవతి యగునొకకన్యను చూచెను. ఆమెశరీరశోభ చేత ఆపర్వత ప్రాంతమంతయు విరాజిల్లుచుండెను. ఆమెను చూచి, సంవరణుడు 'కన్ను లున్నందుకు ఫలము నేడుగదా చేకూరెను' అని తలచెను. ఆమెనుచూచుచు దిగ్భ్రమచెంది అచంచలుడై యచటనే నిలబడెను. ఆమె సౌందర్యముచేత ఆకర్షింపబడి ఆమెపై మోహము గలవాడై "కాంతా! నీవెవతెవు? ఇక్కడ ఎందుకున్నావు? ఈ నిర్జనారణ్యమునందు ఏకాకినివై యేల సంచరించుచున్నావు? నీతో సమానమైన స్త్రీరత్నమును నేనెక్కడగూడ చూడలేదు. చంద్రునికన్న సుందరతరమగు నీ ముఖమును చూచినప్పటినుండి మన్మథుడు నామనస్సును మథించుచున్నాడు" అని పలికెను. ఆమె ఒక్కమాటగూడ బదులు చెప్పక మెఱుపువలె అంతర్ధానము చెందెను. ఆమెకై సంవరణు డావనమంతయు వెదకి ఎక్కడను కానక దుఃఖించుచు ఒక గడియసేపు కదలక నిలిచెను. కొంతసేపటికి భూమిపై పడిపోయెను. ఆయవస్థలోనున్న రాజపుత్రునకు తపతి మరల కనపడి మధురముగా, "రాజా! నీవీ భూమండలములో అతి ప్రసిద్ధుడవు. నీవిట్లు మోహవశుడవు కాకూడదు. లెమ్ము." అని యనెను ఆమాటలు విని సంవరణుడు "సుందరాంగీ! నిన్నుచూచి మోహవశుడనైతిని. నా మనస్సు తపించుచున్నది. నిన్నుచూచినకన్నులతో మరియొకరిని చూచుటకు ఇచ్చలేదు. నీవు చేపట్టకున్న నా ప్రాణములు నిలువవు. కనుక గాంధర్వవిధిచేత నన్నుపెండ్లియాడుము." అని యనెను. ఆ మాటకు తపతి నేను కన్యను. అస్వతంత్రురాలను. నేనుగూడ నిన్నుచూచినప్పటినుండి మోహవశురాలనై యున్నాను. కనుక నా తండ్రియగు సూర్యుని ఆరాధించి అతని అనుగ్రహము బడసి నీకు నన్నిమ్మని కోరుము. ఆయన యిష్టపడి నన్ను నీకిచ్చినచో నేనుగూడ సంతోషపూర్వకముగా నీకు వశురాలనునయ్యెదను." అని చెప్పి తపతి ఆకాశమున కెగిరిపోయెను.

సంవరణుడు కామవశుడై యచటనే మూర్ఛిల్లిపడిపోయెను. అతనిని వెదకుచు సైనికులు, మంత్రి వచ్చి చూచిరి. అట్లు పడియున్నవానిని మంత్రివరుడు లేపి కూర్చొనజేసి చల్లని సుగంధిజలమును తలపైన, ముఖముపైన చిలికెను. రాజు తేరుకొని సైన్యమును పట్టణమునకు పంపి మంత్రిని మాత్రము తనవద్ద ఉంచుకొనెను. ఆపర్వతమునందే నిలిచి సూర్యు నారాధింప దలచి తనగురువగు వసిష్ఠుని స్మరించుచు పన్నెండు దినములు రేయింబవళ్లు దీక్షతో ఊర్ధ్వముఖుడై యుండెను. వసిష్ఠుడు వచ్చెను. సంవరణుడు తపతియందలి కామముచే బాధపడుచున్నట్లు దివ్యదృష్టితో కనిపెట్టెను. అతనియిచ్ఛను పూర్తిచేయుటకై వసిష్ఠుడు సూర్య లోకమునకు పోయి సూర్యుని స్తుతించెను. సూర్యుడు సంతుష్టుడై వరము కోరు మనెను. వసిష్ఠుడు తన శిష్యుడూ, ధర్మాత్ముడూ, రూపసౌందర్య శోభితుడు నగు సంవరణునకు తపతి నిమ్మని కోరెను. సూర్యుడిచ్చెను. ఆమెను తోడుకొని వసిష్ఠుడు భూలోకమునకు వచ్చుచుండుటను క్రిందినుండి సంవరణుడు చూచి మిక్కిలి హర్షము చెందెను. వసిష్ఠుడు తపతిని అతని కిచ్చి వివాహముచేసెను. వసిష్ఠుని యాజ్ఞచేత సంవరణు డామెతో ఆపర్వతమునందే విహరించుచుండెను. వసిష్ఠుడు రాజును వీడుకొనిపోయెను. తపతీ సంవరణులిట్లు ఆ పర్వతమునందు పన్నెండు సంవత్సరములు విహరించుచుండిరి. ఆ పన్నెండేండ్లకాలము అతని దేశములో అనావృష్టి. కరవు ఏర్పడెను. అబాధకు, ప్రజలు, ఇతర జంతువులు నశించిరి. అనేకులు ఇండ్లు వీడి దిక్కులు పట్టి తిరిగిరి. ఈ దురంతమును చూచి వసిష్ఠుడు తనతపోబలముచేత ఆరాజ్యమునందు వర్షము కురియించెను. తపతీసంవరణులను తోడుకొనివచ్చి పురమునందు నిలిపెను. ఆ రాజదంపతులు పన్నెండుసంవత్సరములు దీక్షతో యజ్ఞము చేసిరి. దేశమంతయు సుభిక్ష మయ్యెను.

చిత్రరథుడు అర్జునునకు పైకథచెప్పి "అర్జునా! ఆ యిరువురికి 'కురు' అను రాజు జనించెను. ఆవంశములో నీవు జనించితివి కనుక నీవు 'తాపత్యుడ' వయితివి." అని చెప్పెను.

ఆకథవిని సంతుష్టుడై యర్జునుడు గంధర్వునితో 'చిత్రరథా' వసిష్ఠు డెవడు? అతని తపోమహిమనుగూర్చి తెలుపు మనెను. దానికి గంధర్వు డిట్లు చెప్పెను. "బ్రహ్మదేవునిమనస్సునుండి పుట్టినమహర్షి వసిష్ఠుడు. అతనిపత్ని మహాసాధ్వియగు అరుంధతి. ఆ ముని యింద్రియములను తనవశమునందు ఉంచుకొనినాడు గనుక 'వసిష్ఠుడు' అనుపేరుతో నొప్పెను. అతడు తననూర్గురు కొడుకులను విశ్వామిత్రుడు చంపినప్పటికిని అతనిపై కోపము వహించక యతనికుశికవంశమును నాశము చేయలేదు. చచ్చిన కొడుకులను బ్రతికించి యమలోకమునుండి తిరిగి తేగలిగినవాడై నప్పటికిని, సింధుసముద్రము తనతీరములను దాటనట్లుగా, యమరాజుయొక్క మర్యాదను ఉల్లంఘించ దలచలేదు. అతనిని పురోహితునిగా జేసికొని యిక్ష్వాకు వంశపురాజులు అతనియనుగ్రహమువలన సమస్త భూమండలమునకు రాజులైరి. ఆముని వారిచేత అనేక యజ్ఞములను చేయించి వారికీర్తిని భూమిలో చిరస్థాయిగా నిలిపెను.

కనుక అర్జునా! మీరుగూడ ధర్మాత్ముడు, వేదశాస్త్రకోవిదుడు, గుణవంతుడు నగునొక బ్రాహ్మణుని పురోహితునిగా చేసికొనుడు. సత్కులసంజాతు డగుక్షత్రియుడు తనరాజ్యాభి

వృద్ధికిగాను ఉత్తమపురోహితుని నియమించుకొనవలెను. అతని ఉపదేశముప్రకారము నడుచుకొనినరాజు తప్పక శత్రుజయమును సాధింపగలడు.

## విశ్వామిత్ర పరాభవము

అర్జునుడు, 'విశ్వామిత్ర వసిష్ఠులకు వైర మెందుకు వచ్చినది? చెప్పు' మని గంధర్వు నడిగెను. అత డాకథ నిట్లుచెప్ప దొడగెను:—

'కాన్యకుబ్జదేశమునందు 'కుశికుని' కొడుకగు 'గాధి' రాజునకు అధికబలసంపన్నుడగు 'విశ్వామిత్రుడు' అను కొడుకు ఉండెను. అతడు పరివారముతో నొకనాడు వేటకు పోయి అనేక మృగములను వేటాడి వనమెల్ల తిరుగుచు అలసి ఆకలిదప్పులుగొని వసిష్ఠునియాశ్రమమునకు పోయెను. ఆముని, రాజునకు అతిథి సత్కారము చేసి మిగుల ఆదరించెను.

వసిష్ఠమహామునివద్ద కోరినకోర్కెలనెల్ల తక్షణమే తీర్చునట్టి ఒక కామధేనువు ఉండెను. ఆధేనువు సమస్త భక్ష్య భోజ్యములు తలచినంతనే ఉత్పన్నములు చేసెను. వసిష్ఠుడు విశ్వామిత్రునకు అతనిపరివారమునకు మిష్టాన్నముచేత తృప్తిగా భోజనము పెట్టెను. ఆయావుపేరు 'నందిని'. అట్టిఅద్భుతకరము, సుందరమునైనధేనువును తన కిమ్మని విశ్వామిత్రుడు వసిష్ఠుని కోరెను. 'అర్బుదము (పదికోట్లు) ఆవులను దీనికి బదులుగా నిచ్చెదను. లేదా, నా సమస్త రాజ్యమునే నీకిచ్చెదను. నీవు సుఖముగా రాజ్యము నేలుకొనుము'. అని వసిష్ఠునితో ననెను. 'ఇది నాదేవపూజ, అతిథిపూజ, యజ్ఞము మొదలగు సత్కార్య ములకు నిత్యము నాకు సహాయము చేయుకామధేనువు. కనుక రాజ్య మిచ్చినను దీనిని నీ కీయను.' అని వసిష్ఠు డనెను. 'నీ వీయ నిచో బలప్రయోగము చేసి దీనిని పట్టుకొని పోయెదను.' అని విశ్వామిత్రుడనెను. 'నీకు సైన్యము, బాహుబలము ఉన్నది. నీవు క్షత్రియుడవు. నీఇచ్ఛవచ్చినట్లు చేసికొనుము.' అని వసిష్ఠు డనెను.

అప్పుడు విశ్వామిత్రుడు కొండాలతో ఆయావును కొట్టుచు తోలుకొని పోవ జూచెను. కాని అది 'అంబా' యని యరచుచు ఆశ్రమము వీడిపోవక వసిష్ఠునియెదుట వచ్చి నిలిచెను. 'నందినీ! నీబాధను జూచుచున్నాను. నేను శాంతుడ నగుబ్రాహ్మణుడను ఏమి చేయగలను?' అని వసిష్ఠు డనెను. ధేనువు వసిష్ఠునికడనే కదలక నిలిచినను సైనికులు దానిదూడను త్రాటితో గట్టి లాగికొని పోవుచుండుటను చూచి 'పుత్రేషణ' చేత ఆగలేక నందిని రౌద్రాకారము వహించి సైనికులపైకి ఉరికి వారిని భంజించుచు వీరవిహారము చేసెను. తోకనుండి నిప్పులు గురియుచుండెను. సర్వావయవములనుండి యవన బర్బర మ్లేచ్ఛాదులైనఅనేక వీరులను కనెను. వారు ఘోరముగా విశ్వామిత్రునిసైన్యమును చిందరవందర చేసిరి. ఒక్కొక్క సైనికునకు అయిదుగురు చొప్పున వారు జనించియుండిరి. విశ్వామిత్రుడు దిక్కుదెలియక చూచుచుండగనే అతనిసైన్యము భగ్నమై పారిపోయెను.

బ్రహ్మతేజస్సువలన గలిగిన ఆ యద్భుతమును జూచి విశ్వామిత్రుడు నిర్విణ్ణుడై 'ధిక్‌బలం క్షత్రియబలం బ్రహ్మ తేజోబలం బలం' (బ్రహ్మతేజస్సుముందు తనక్షత్రియబలము వ్యర్థము.) అని తనను తనశక్తిని తాను నిందించుకొనెను. రాజ్య మును, సమస్తసంపదలను, సుఖములను విడిచి ఘోరముగా తపస్సు చేసి చివరకు బ్రాహ్మణత్వమును సంపాదించి విశ్వా మిత్రుడు ఇంద్రునితో ఆనందముగా సోమపానము చేయు చుండెను.

## కల్మాష పాదునికథ

గంధర్వుడు తరువాతికథ నిట్లు చెప్పదొడగెను :—
పూర్వము 'కల్మాషపాదుడు' అను ఇక్ష్వాకువంశపురాజు ఉండెను. అత డొకనాడు సపరివారముగా వేటకై వనమునకు పోయెను అనేకమృగములను వేటాడి అలసి యింటికి తిరిగి వచ్చుచుండెను. మార్గమధ్యమునందు కల్మాషపాదుడు ఒక వ్యక్తిమాత్రము పోవుటకు అనువైన యిరుకుదారిలో పోవుచుండెను. అతనికి ఎదురుగా వసిష్ఠునిజ్యేష్ఠపుత్రుడు 'శక్తి' మహాముని వచ్చు చుండెను. 'దారి విడువు' మని కల్మాషపాదుడు శక్తిని కోరెను. 'ఇది ధర్మముప్రకారము నామార్గము. నీవు క్షత్రియుడవు. బ్రహ్మర్షినైననాకు తొలుతదారిని విడువవలెనేకాని నేనుమాత్రము తొలగిపోను.' అని శక్తి యనెను. ఇట్లాయిరువురు మార్గము కొరకు వాగ్వాదము చేయుచుండిరి. ధర్మపథమునందున్న శక్తి పట్టుదలతో నుండెను. బలగర్వితు డగుకల్మాషపాదరాజు తనపట్టు వీడక క్రుద్ధుడై శక్తిమహామునిని కొరడాతో కొట్టెను. శక్తి కుపితుడై 'రాక్షసునివలె నీవు నన్ను కొట్టుచున్నావు. కనుక నరమాంసభక్షకుడవగు రాక్షసుడవు కమ్ము.' అని కల్మాష పాదుని శపించెను.

ఆసమయమునందే యజ్ఞములో యజమానునినిమిత్తమై వసిష్ఠ విశ్వామిత్రులకు వైరము సంభవించెను. విశ్వామిత్రుడు కల్మాషపాదుని కడకు వచ్చెను. అప్పుడు కల్మాషపాదుడు తన చేత దెబ్బలు తినినవాడు వసిష్ఠపుత్రుడు శక్తి యని తెలిసికొనెను. విశ్వామిత్రుడు ఆయిరువురిని మోసగించి స్వార్థమును నెరవేర్చు కొనుటకై యంతర్ధానము చెందెను. శక్తిచేత శపింపబడిన కల్మాష పాదుడు శక్తిని ప్రసన్నుని చేయుటకై శరణువేడెను. విశ్వామిత్రు డది తెలిసి 'కింకరుడు' అనుపేరు గల రాక్షసుని కల్మాషపాదునిలో ప్రవేశింపు మని యాజ్ఞాపించెను. శక్తిశాపము, విశ్వామిత్రుని యాజ్ఞ—యీరెంటి ప్రభావముచేత కింకరుడు వెంటనే కల్మాష పాదునిలో ప్రవేశించి యతనితో క్రూరకర్మలు చేయింప మొదలిడెను కల్మాషపాదుడు రాక్షసావిష్టుడైనతరువాత విశ్వా మిత్రు డచటినుండి వెడలిపోయెను. రాక్షసుడు తనలో ఆవేశించి నందువలన ఆరాజు యుక్తాయుక్తములు తెలియక బాధపడుచు తిరుగుచుండెను.

ఇట్లున్న కల్మాషపాదుడు ఒకనాడు వనమునకు పోవు చుండగా నొకబ్రాహ్మణు డెదురై 'ఆకలిగొన్నాను. మాంసముతో గూడిన భోజనము పెట్టుము' అని అతనిని యాచించెను. ఆరాజు

బ్రాహ్మణుని తో, 'ఇచ్చటనే యుండుము. నేను వనమునుండి తిరిగివచ్చి నీవు కోరినభోజనమును పెట్టించెదను.' అని చెప్పి వెడలి పోయెను. కాని, యారాజు ఆమాటయే మరచిపోయెను. తిరిగి వచ్చి తాను మరచి యంతఃపురములో పరుండెను. అర్ధరాత్రమునందు ఆ బ్రాహ్మణుడు కల్మాషపాదుని కడకు వచ్చెను. వెంటనే వంటలవానిని పిలిపించి 'వనమునందు ఒక బ్రాహ్మణుడు నాకొరకు వేచియున్నాడు. అతనికి భోజనము పెట్టెద నంటిని. నీవు పోయి యతనికి మాంసముతోకూడిన అన్నమును పెట్టుము.' అని చెప్పెను. రాజాజ్ఞ ప్రకారము వంటలవాడు అడవికి పోయెను ఎచ్చటను అతనికి మాంసము లభించలేదు. తిరిగి వచ్చి రాజునకు ఆసంగతి తెలిపెను. రాక్షసావిష్టుడైన రాజు, అయుక్తమని తలచక, నరమాంసముతో బ్రాహ్మణునకు భోజనము పెట్టుమని మువ్మారు చెప్పెను. ఆ యాజ్ఞప్రకారము వంటలవాడు మరణ దండన విధింపబడినవారిని ఉరితీయువారియింటికి పోయి మనుష్య మాంసమును తెచ్చి వండి ఆ బ్రాహ్మణునకు పెట్టెను అతడు దివ్య దృష్టితో 'అది అభోజ్యాన్న'మని తెలిసికొని క్రుద్ధుడై 'ఏ నరమాంసము నాకు ఈరాజు పెట్టెనో అట్టిభోజనము నిష్టపడు రాక్షసుడు గానే యతడగుగాక' అని శపించెను. లోగడ శక్తి యిచ్చిన శాపము ఇప్పుడు బ్రాహ్మణు డిచ్చినశాపము రెండును కలిసి మిక్కిలి ప్రబలమై కల్మాషపాదుని వివేకశక్తి పూర్తిగా లోపింప జేసెను.

ఆ తర్వాత కల్మాషపాదుడు శక్తిమహామునికడకు పోయి 'నీవు నాకిచ్చిన శాపముప్రకారమే నేను నరమాంసభక్షణమును నిన్ను చంపి తినుటతోడనే ఆరంభించెదను' అని చెప్పి యామునిని వ్యాఘ్రము పశువును చంపినట్లువలె చంపి తినెను. శక్తిముని చనిపోయినతరువాత అంతటితో తృప్తిపడక విశ్వామిత్రుడు ఆరాక్షసుని, శక్తి తమ్ములు తొంబదితొమ్మండుగురపైనను ప్రయోగించెను. కల్మాషపాదుడు ఆ ప్రకారమే క్రమముగా శక్తి సోదరులందరను చంపి తినెను. విశ్వామిత్రు డీవిధముగా వసిష్ఠునినూర్గురు పుత్రులను చంపించినను వసిష్ఠుడు ఓర్పుతో పర్వతము భూమిని ధరించినట్లు కోపమును తనలోనే ధరించెను. పుత్రశోకమును భరించలేక వసిష్ఠుడు ఆత్మహత్యకు పూనుకొనెనేకాని కౌశికవంశ నాశమునకు తలపెట్టలేదు. వసిష్ఠుడు పుత్రశోకమును భరించలేక మేరువునుండి శిలపైన పడెను. ఆరాయి దూదివలె మెత్తనయ్యెను. మండుచున్న అగ్నిలో ప్రవేశించెను. అది చల్లబడి హిమశీతలమయ్యెను. గొంతుకు రాయికట్టుకొని సముద్రములో దుమికెను. సముద్రుడు తనతరంగహస్తములతో నాబ్రహ్మర్షిని ఒడ్డునకు తెచ్చెను. ఎంత ప్రయత్నించినను తనకు మరణము కలుగకున్నందున విసిగి ఆత్మహత్యాప్రయత్నమునుండి విరమించి ఖేదముతో ఇంటికి పోయెను. పుత్రులు లేనిశూన్యాశ్రమమును జూచి వసిష్ఠుడు తిరిగి పుత్రశోకార్తుడై ఆవర్షాకాలమునందు నవోదకతరంగములచే భయంకరముగ ప్రవహించుచున్న ఒక నదిలో, పాశముతో తనను బంధించుకొని దుమికెను. ఆ నది తన అలలపైన ఆ మహామునిని మోసికొని యొడ్డు చేర్చి పాశబంధ విముక్తుని జేసెను. తనను పాశవిముక్తుని జేసినందున వసిష్ఠుడు ఆ నదికి 'విపాశ' అను పేరు పెట్టెను. ఎంతకును తనకు మరణము ప్రాప్తించనందున వసిష్ఠుడు, విధవయైన కోడండ్రను చూడలేక యెక్కడను నిలకడ చిక్కనివాడై పర్వతములను, నదులను సరస్సులనుబట్టి పిచ్చివానివలె తిరుగుచు ఒకనాడతడు హిమాలయమునుండి ఘోరముగా ప్రవహించు నదిలో దుమికెను. దానిలో భయంకరములగు మొసళ్లు ఉండెను. ఆ నది అగ్నివంటి అతనితేజస్సును భరించలేక నూరుపాయలుగా చీలిపారెను. అందుచేత ఆనది నాటినుండి 'శతద్రు' (నూరుగా ప్రవహించునది.) అను పేరబరగెను. ఆనది విచ్చిపోవుటచేత ఆ ముని తిరిగి భూమిమీదివానివలెనే యుండెను.

ఈవిధముగా పుత్రశోకభరముచేత వసిష్ఠుడు నానాపర్వత నదీనదములను పరిభ్రమించి పునః ఆశ్రమమునకే వచ్చెను. కాలు నిలువక మరల పోజొచ్చెను అప్పుడు 'అదృశ్యంతి' అను పెద్దకోడలు అతనివెంట వెడలెను. వెనికిపార్శ్వమునందు వసిష్ఠునకు సాంగవేదధ్వని వినిపించెను. తిరిగి చూచుసరికి కోడలగు, శక్తిభార్య కనపడెను. ఎక్కడిదీధ్వని యని యామె నడిగెను. 'శక్తితేజస్సు నాగర్భములో పన్నెండు సంవత్సరములుగా నున్నది. ఆగర్భస్థశిశువు వేదము నభ్యసించెను ఆధ్వని యిది' యని అదృశ్యంతి చెప్పెను. ఆమాట విని వసిష్ఠుడు 'తనవంశములో సంతానము కలుగనున్నది' అని తలచి ఆత్మహత్య నుండి విరమించుకొనెను.

కోడలితో ఆశ్రమమునకు తిరిగి వచ్చుచు వసిష్ఠుడు వనమునందు కూర్చొనియున్న కల్మాషపాదుని చూచెను రాక్షసావిష్టుడైన ఆరాజు వసిష్ఠుని జూచి క్రుద్ధుడై అతనిపైన బడి చంపి తినబోయెను. అతనిని చూచి అదృశ్యంతి మిక్కిలి భయపడి 'మహాత్మా! ఇతడు నన్ను చంప వచ్చుచున్నాడు, మీరు తప్ప ఇతరు లితనిని నివారింప లేరు'. అని అరచి రక్షింపుమని వసిష్ఠుని వేడుకొనెను. 'పుత్రీ! భయపడకుము. ఇతడు రాక్షసుడు కాడు. కల్మాష పాదు డనురాజు. రాక్షసావిష్టుడై యీ వనమునందు భీషణముగా తిరుగుచున్నాడు.' అని వసిష్ఠుడు కోడలి నోదార్చెను. తనపైన పడబోవుచున్న ఆరాజుపైన వసిష్ఠుడు మంత్రపూతజలమును ప్రోక్షించి అతనిని శాపవిముక్తుని జేసెను పన్నెండు సంవత్సరములుగా కల్మాషపాదుడు, రాహుగ్రస్తుడైన సూర్యునివలె, శక్తిశాపగ్రస్తుడైయుండి యిప్పుడు గ్రహణవిముక్తుడైన సూర్యునివలె, తేజరిల్లెను. రాక్షసు డతనినుండి విడిపోవగానే యతడు తన తేజస్సుచేత దిక్కులను రంజింప జేసెను. పూర్వస్మృతిని పొంది, తనగోత్రనామముల నుచ్చరించుచు కల్మాషపాదుడు (సౌదాసుడు) వసిష్ఠమహామునికి ప్రణామము చేసెను, 'మీ యాజ్ఞను నెరవేర్చెదను. సెలవీయగలరు' అని వసిష్ఠుని ప్రార్థించెను. 'అంతయు బాగుగనే అయినది. పోయి రాజ్యము నేలుము.

ఇంకెప్పుడు గూడ బ్రాహ్మణులను అవమాన పరచకుము' అని వసిష్ఠుడు చెప్పెను. "మీ యాజ్ఞను శిరసావహించెదను. ఇక్ష్వాకుల వర్ధనుడగు సత్పుత్రుని అనుగ్రహింపుడు. దానితో నేను పితరుల ఋణము నుండి విముక్తుడ నయ్యెదను '' అని కల్మాషపాదుడు వేడుకొనెను 'అట్లేయగుగాక' యని వసిష్ఠుడు ఆరాజునకు వరము

నిచ్చియుతనితోపాటు అయోధ్యాపట్టణమునకు పోయెను. అనేక సంవత్సరముల తరువాత శాపవిముక్తుడై తిరిగి వసిష్ఠ మహామునితో పాటు నగరమునకు వచ్చిన రాజునకు ప్రజలు సంతోషముతో స్వాగత మిచ్చిరి. నగరమును అలంకరించిరి. కల్మాషపాదుడు పైభవోపేతుడై అంతఃపురములో ప్రవేశించెను. అతని యాజ్ఞ చేత అతని పత్ని 'మదయంతి' వసిష్ఠ మహాముని కడకు పోయెను. ఆ ముని, పూర్వము రాజున కిచ్చినవరము ప్రకారము ఋతుకాలమునందు అలౌకిక మగునియోగవిధానము చేత ఆమెతో కలిసి ఆమెకు ఉత్తమమగు గర్భమును ప్రసాదించి తన యాశ్రమమునకు వెడలిపోయెను. చాల కాలమునకును గర్భమునుండి శిశువు వెడల నందుకు మదయంతీదేవి పాషాణముచేత తన గర్భముపైన కొట్టుకొనెను. ఆ తరువాత పన్నెండేండ్లకు ఆమెకు ఒక బాలకుడు పుట్టెను. అతని పేరు 'అశ్మకుడు' (అశ్మము-రాయిచేత కొట్టగా పుట్టినవాడు.) అని ప్రసిద్ధ డయ్యెను. అతడు 'పౌదన్యము' అను పురమును నిర్మించెను.

## ఔర్వోపాఖ్యానము.

గంధర్వుడగు అంగారపర్ణుడు (చిత్రరథుడు) అర్జునునితో తరువాతి కథ యిట్లు చెప్పదొడగెను:—

శక్తి భార్య అదృశ్యంతి వసిష్ఠాశ్రమమునందు మహాతేజశ్శాలి, విద్వాంసుడు నగుపుత్రుని కనెను. అతనికి వసిష్ఠుడు స్వయముగా జాతకర్మ చేసెను. ఆబాలకుడు తల్లిగర్భములో ప్రవేశించి, పరాసువైన (మరణింపవలెనని యిచ్ఛతో నున్న) వసిష్ఠునకు జీవితమునందు 'ఆశ' కలిగించెను గనుక 'పరాశరుడు' అనుపేరుతో ప్రసిద్ధ డయ్యెను. అతడు వసిష్ఠునే తనకు తండ్రిగా భావించి "తండ్రీ!" యనియే సర్వదా పిలుచు చుండెను. తల్లియగు అదృశ్యంతి యొకనాడు దుఃఖించుచు కొడుకుతో 'నాయనా'! నీ తండ్రి రాక్షసునిచేత హతుడయ్యెను. ఈ ధర్మాత్ముడు నీకు పితామహుడు ' అని చెప్పినతోడనే పరాశరుడు తండ్రిహత్యకు మిగుల కోపించి సర్వలోక వినాశముచేసెద నని నిశ్చయించెను. వసిష్ఠు డతనిని వారించి పూర్వకథ నొకదాని నిట్లు చెప్పెను:—

వత్సా! ఈ భూమండలము నందు 'కృతవీర్యుడు' అను నొకరాజు ఉండెను. అతడు భృగువంశ బ్రాహ్మణులు చేయుయజ్ఞములందు యజమానుడుగ నుండెను. సోమయాగము చేసి యారాజు భృగు వంశీయులకు విపులధనధాన్యములిచ్చి వారిని సంతుష్టిపరచెను ఆరాజు మరణించినతరువాత అతని వంశీయులకు ధన మావశ్యక మయ్యెను. భృగువంశీయబ్రాహ్మణులవద్ద ధన మున్న దని తెలసి యారాజులా బ్రాహ్మణులను ధనము యాచించిరి. ఆసమయమునందు కొందరు బ్రాహ్మణులు ధనము వారి కిచ్చుట కిష్టపడక తమ అక్షయధనరాశిని భూమిలో పాతిపెట్టి ధనము లేదనిరి. కొందరు, రాజులకుభయపడి ధన మిచ్చిరి. మరికొందరు తృప్తితో నిచ్చిరి. మరి యనేకకారణములవలన ననేకులు బ్రాహ్మణులు రాజులకు ధన మిచ్చిరి.

ఒక నాడొకరాజు యాదృచ్ఛికముగా నొకభూమిని త్రవ్వెను. అది యొకభృగు వంశీయునిది. దానిని త్రవ్వగానే అకస్మాత్తుగా ధనరాశి కనబడెను. అది చూచి యారాజు ఇతరరాజులను, పిలిచి ధనమును చూపించెను. అప్పుడు వారందరు భృగువంశీయులను, వారు శరణు చొచ్చినను వినిపించుకొనక, అవమానపరచి చంపిరి. భృగువంశీయస్త్రీలగర్భమునందలి శిశువులను గూడ చంపుచు నారాజులు దేశమంతట సంచరించిరి. ఈవిధముగా భృగువంశనాశమునకు పూనుకొనినరాజులకు భయపడి స్త్రీలు హిమాలయమునకు పారిపోయి అచటి గుహలలో దాగి యుండిరి. ఒకస్త్రీ భయపడి గర్భస్థ శిశువును తీసి తనతొడను చీల్చి అందులో దాచి రక్షించెను. తన పతివంశమును నిలబెట్టుట కామె యీ సాహసకృత్యమును చేసెను. ఈరహస్యము తెలిసిన యొక భృగువంశ బ్రాహ్మణి భయపడి క్షత్రియులకడకు పోయి ఆ సమాచారమును తెలిపెను. వెంటనే క్షత్రియులు ఆ ఊరు (తొడ) గర్భమును నశింప జేయుటకు వచ్చిరి. అప్పుడు ఊరువును భేదించుకొని మహాతేజశ్శాలి యగుశిశువు బయటకు వచ్చెను. అందుచేత అతనికి ఔర్వుడు అని పేరు వచ్చెను ఆ తేజస్సు కన్నులకు సోకి ఆ రాజులు అంధులై గిరికందరములందు దిక్కులు తెలియక పరిభ్రమించు చుండిరి. మోహితులై వారు తిరిగి ఆ బ్రాహ్మణివద్దకేపోయి శరణుజొచ్చి దృష్టిని ప్రసాదించుమని వేడుకొనిరి. ఆమె, (రాయనలారా! ఈ కుమారుడు మీపై కోపించి యిట్లు చేసెను. మిమ్మందరను చంపదలచు చున్నాడు. నాతొడలో నూరేండ్లు ఇతనిని కాపాడితిని. వేదవేదాంగములన్నియు నేర్చెను. మహాతేజశ్శాలియగు నితనిని వేడుకొనుడు. ప్రసన్నుడై మీకు దృష్టిదానము, ప్రాణదానము చేయగలడు! అనిచెప్పగనే వారు ఆమునిబాలకుని వేడుకొనిరి. అతడు కరుణించి వారిని కాపాడి వారికి దృష్టిని ప్రసాదించెను. వారు సంతసించి యథేచ్ఛగా వెడలి పోయిరి.

ఆతరువాత ఔర్వుడు తన తండ్రులఅకాల దుర్మరణమునకు గలిగినకోపముచేత శాంతి లేక సర్వలోకనాశమునకుగాను ఘోరమైన తపస్సు చేయుట కారంభించెను. ఆతనితపోగ్నిచేత సర్వలోకవాసులు పరితపించుచు హాహాకారము చేసిరి. అప్పుడు పితృలోకమునుండి ఔర్వుని పితృదేవతలు వచ్చి, 'నాయనా! కోపపడకుము—సర్వలోకనాశము మహాపాపము. అట్టితపస్సును మానుకొనుము. రాజులు మాకేలాటి అపకారమును చేయలేదు. మేము దీర్ఘకాలజీవులమై యెప్పటికిని మాకు చావు రాకున్నప్పుడు బ్రతుకుపై రోసి, ఆత్మహత్య మహాపాపమని, యీ పన్నాగముచేత రాజులు మమ్ము చంపునట్లు చేసికొంటిమి. మమ్ము చంపుశక్తి యీ రాజులకెక్కడిది! మేమే మాలో నొకని యింట ధనమును పాతిపెట్టి వారికి తెలియునట్లు చేసితిమి. వారుతెలిసికొని మమ్ము చంపిరి. హత్యకు అంగీకరించితిమి. మాకు ధనాశ లేదు. కుబేరుడు కావలసినంత ధనము మాకిచ్చినాడు. కనుక రాజులను చంపకుము. లోకములకు నాశము కల్పింపకుము. క్రోధమును చంపుకొనుము.' అని యుపదేశించిరి.

ఆమాటలను విని ఔర్వు డిట్లనెను:—"తండ్రులారా! నేను కోపముచే సర్వలోకనాశార్థమై ప్రతిజ్ఞ పూనితిని. నాకోపము వ్యర్థము కాదు. ప్రతిజ్ఞాపూరణము చేయవలసి యేయున్నది. ఒక

కార్యము మూలముగా పుట్టినకోపమును ఆపని నెరవేరకమున్నె శమింపజేయువాడు ధర్మార్థకామములను సాధించలేడు. శిష్టరక్షణ దుష్టశిక్షణకై రోషమును ప్రయోగించుట యుక్తము. నేను తొడలో నున్నప్పుడు నాతల్లుల రోదనధ్వని వినినాను. నాతండ్రులను రాజులు చంపిరి. అందువలన గర్భమునుండి బయటకు వచ్చినప్పటినుండి నాకుకోపము కలిగినది. పాపము నరికట్టువాడు ఉన్నప్పుడు పాపము చేయువాడు మూడులోకములలోను నుండడు. అట్టివాడు లేనప్పుడు సర్వత్ర పాపకార్యములు వ్యాపించును. పాపమును తెలిసికూడ సమర్థుడైనవాడు దానిని అరికట్టనిచో ఆపాపఫలము అతనికిగూడ అంటును. లోకములో అందరికిని ప్రాణములపైన తీపి ఉండునని తెలిసికూడ అందరిని ఏలు రాజులు సమర్థులైనప్పటికిని నాపితరులను రక్షింపజాలకపోయిరి. అందువలన లోకముల పైననే నాకు కోపము వచ్చినది. మీరు ఆజ్ఞాపించినను నాకోపము శాంతించు నట్లులేదు. నాకు శక్తియున్నప్పటికిని లోకులపాపాచరణములను అరికట్టక ఉదాసీనుడనై చూచుండినయెడల వారిపాపము నాకు అంటునగదా! సమస్తలోకములను ఆక్రమించుకొను శక్తిగల నాకోపాగ్నిని నేను అణచినచో నది నన్నే దహించివేయును. సర్వలోకహితమును మీరు కోరుచుండుట నే నెరుగుదును. కనుక ఇప్పుడు లోకములకు, నాకును హితమైన మార్గ మేదియో సెలవీయగలరు."

ఆమాటలు విని పితృదేవతలు ఔర్వునితో నిట్లనిరి :—"నాయనా! సర్వలోకహరమైన యీ నీ తపోగ్నిని జలములో విడువుము. ఎందుకనగా జలమునందు సర్వలోకములును ప్రతిష్ఠితములై యున్నవి. కనుక సర్వలోకమయమగు జలమును దహించుచు నీకోపాగ్ని సముద్రమధ్యమునందు సర్వదా ఉండుగాక. ఈవిధముగా నీ ప్రతిజ్ఞగూడ సత్యమగును. లోకములును రక్షింపబడును."

ఈవిధముగా వసిష్ఠుడు పరాశరునకు చెప్పి, 'నాయనా'. ఔర్వుని కోపాగ్ని నేడుగూడ సముద్రమధ్యమునందు ఉండి బడబా (ఆడుగుఱ్ఱము) ముఖమువంటియాకారము గలదై జలమును పానము చేయుచుండును. పుణ్యపాపముల నెరిగినవాడ వగుటచేత నీవు లోకనాశమునకు పూనుకొనకుము. ఔర్వుడు పితరుల యాజ్ఞ విని శాంతి వహించినట్లు నీవును శాంతించి లోకహితము చేయుము." అని చెప్పెను.

పితామహునియాజ్ఞప్రకారము పరాశరుడు సర్వలోకనాశేచ్ఛనుండి విరమించుకొనెను. కాని సర్వరాక్షసనాశమును చేయ బూని 'రాక్షసయజ్ఞమును' చేయ నారంభించెను. ఆయజ్ఞములో వృద్ధులు, బాలురు మొదలుకొని సర్వరాక్షసులను మంత్రబలముచేత రావించి హోమము చేసెను. పరాశరుని రెండవప్రతిజ్ఞయగు 'రాక్షసనాశము'ను వసిష్ఠుడు వారించలేదు. ఆయజ్ఞములో 'దక్షిణాగ్ని, గార్హపత్యము, ప్రాజాపత్యము' ననుమూడు అగ్నులతోపాటు పరాశరుడు నాల్గవఅగ్నిగా తేజరిల్లుచు కూర్చొని యుండెను.

అప్పు డాయజ్ఞము నాపుటకు ఇతరులకు సాధ్యము కాదని 'అత్రి' మహాముని వచ్చెను. అతని వెంటనే పులస్త్యాది మునులును 'రాక్షసయజ్ఞమును' ఆపి రాక్షసులను బ్రతికింప దలచి వచ్చిరి. పులస్త్యు డిట్లనెను :—'నాయనా! పరాశరా! నీ తండ్రివధసంగతి యేమియు నెరుగని యీరాక్షసుల నందరిని ఇట్లేల హింసించుచున్నావు. నాసంతతి యగువీరిని అన్యాయముగా చంపుచున్నావే. ఇట్టిక్రూరకృత్యము బ్రాహ్మణుడ వగు నీకు తగునా! శ్రేష్ఠుడ వగు నీ విట్లు అధర్మకార్యము చేయ దగదు. అప్పుడు నీతండ్రియగు శక్తి కల్మాషపాదున కిచ్చినశాపము వలననే అట్టిదుర్ఘటన యేర్పడినది. శక్తిమహాముని తానుజేసిన అపరాధకారణముననే మరణించి స్వర్గసుఖమును భవించుచున్నాడు. ఇందులో రాక్షసుల దోష మేమియు లేదు. పరాశరా! ఏరాక్షసుడు గూడ నీతండ్రిని తిన జాలకుండెను. తానిచ్చినశాపము కారణముగనే తనమృత్యువును తా నాహ్వానించుకున్నాడు. దానికి విశ్వామిత్రుడు నిమిత్తభూతు డయ్యెను. ఈసంగతి యంతయు వసిష్ఠునకు తెలియును. కనుక నాయనా! రాక్షసనాశకరమగు ఈయజ్ఞమును చాలించుము." ఆ మాటను అంగీకరించి పరాశరుడు యజ్ఞమును ఆపి ఆయగ్నిని ఉత్తరదిశలో హిమాలయపార్శ్వభూములందు విడిచెను. అది యిప్పటికిని అచటిచెట్లను, రాక్షసులను, పాషాణములను పర్వదినములలో దహించుచుండును.

గంధర్వు డగుఅంగారవర్ణుడు చెప్పినకథలను విని అర్జును డిట్లు తిరిగి ప్రశ్నించెను:—గంధర్వరాజా! బ్రహ్మవేత్తయైన వసిష్ఠునికడకు కల్మాషపాదుడు తనపత్నిని పుత్రసంతతి కొరకు ఏల పంపెను? పరమధర్మజ్ఞు డగువసిష్ఠు డాయకృత్యమున కేల యంగీకరించెను? తెలుపుము.''

ఆ మాటకు గంధర్వరా జిట్లు బదులు చెప్పెను:—''అర్జునా! శక్తిమహామునిశాపముచేత భిన్నుడై కల్మాషపాదుడు భార్యతో వనమునందు సంచరించు చుండెను. ఒకప్పుడతడు ఆకలిగొని అహారముకొరకై వనమంతయు వెదకెను. ఏదియు లభించలేదు. ఒకనిర్జనవనప్రదేశమునందు బ్రాహ్మణదంపతులు సంగమ వశులై యుండుటను చూచెను. వా రతనిని చూచి భయముచే పరుగెత్తుచుండిరి. రాక్షసావిష్టుడగు కల్మాషపాదుడు బ్రాహ్మణుని పట్టుకొని భక్షింప బోయెను. బ్రాహ్మణి యతనిని వారించి ఋతుసంగమము చేయుచున్నవాని నిట్లుబాధించుట నీవంటి యిక్ష్వాకు కులమహారాజునకు తగదు, విడువు మనెను. అతడు వినక బ్రాహ్మణుని చంపి తినెను. దానికి బ్రాహ్మణి కోపించి యిట్టిదుష్కార్యము చేసితివి గనుక నీవు ఋతుస్నాత యగునీభార్య నంటినచో వెంటనే చత్తువుగాక, యని శపించెను. వసిష్ఠమహాముని యనుగ్రహముచేత నియోగధర్మముద్వారా నీభార్యయందు ఉత్తము డగుపుత్రుడు జన్మించగల డనికూడ ఆమె చెప్పెను. వసిష్ఠున కీసంగతి యంతయు తెలియును గనుకనే ఆనియోగధర్మమునకు అంగీకరించి కల్మాషపాదునిపత్నియందు సంతతిని అనుగ్రహించెను. అందువలన అర్జునా! కల్మాషపాదుడు భార్యను నియోగించెను ధర్మపరుడైన వసిష్ఠుడు దాని కంగీకరించెను.'' (సశేషము)

# మూడు రంగులు

సింధూరం మందారం పారాణీ ఎరుపు.
ఇంకా ఎరుపు
కొబ్బర్నూనె రాసుకొని నాముందునిల్చి అద్దంలో దిద్దుకుంటూన్న నీ పాపిట
ఆఖరిసారిగా వెళ్ళిపోతున్నప్పుడు జడలోంచిరాలి నేలమీద దిగాలునపడిన మందారం
తెల్లటి పట్టు పరికిణీ జరీఅంచు పాదాల్ని తాకుతూ ప్రవహిస్తున్నపుడు మెరుపు
ఇవన్నీ యింకా ఎరుపు
చివరకెప్పుడో కాల్చేసమంటలో గాలికెగసి నైలాన్ నిప్పునాల్క చాచినపుడు.

మంచూ దుఃఖమూ వర్షమూ తెలుపు.
మరీ తెలుపు
హిమాలయాలమీద ఎవడో నాలాటి నిరానంద మౌని పలవరించి ప్రాణంవిడిచి మంచుమీద విరిగి పడినపుడు
రివ్వున చలిచీలిక కళ్ళను కోసి నీళ్ళని పాలిపోయిన నీ కపోలాలమీద ఒక్కొకబొట్టు పిండినపుడు
అర్ధరాత్రి విద్యుత్కాంతికి కిటికీలోంచి గదిలోకి కొట్టుకొచ్చి మన కనురెప్పల్ని తాకేజల్లు.
ఇవన్నీ మరీ తెలుపు
చివరికి వాళ్ళు మనమీదకప్పే మల్లుగుడ్డమీద.

కళ్ళూ కేశపాశం నిద్రదీపం నీలం.
ఇంద్ర నీలం
నువ్వు కాటుక పెట్టుకొని కొంచెం నా తెల్లని చొక్కాకు చిలిపిగా పులిమినపుడు
ఇంకాకొంచం కుంకుడుకాయల వాసనతో గాలికి గాల్లో తేలిపోతూ నీ నీలితీగలు నామీద పడినపుడు
లేత ఆకుపచ్చగౌను తొడుక్కొని నువ్వు పర్వెట్టే రైల్లో పడుకొన్నపుడు గదంతా నిండినకాంతి.
ఇవన్నీ మరీ ముదురునీలం
చివరి కివేవీ నిలవ్వుగదా ఎంతక్షణికంఅని ఒకళ్ళ భుజాలమీద ఒకళ్ళు ఏడ్చే మనచుట్టూ మూగినచీకటి.

ఈ బ్రతుక్కి తోడు
ఇంకా ఏరంగుల్తో వర్ణించుకోను నిన్ను!
ఒక్కదుఃఖమే కుంచె
అన్ని రంగుల్లోనూ ముంచుకొని తీరా తృప్తిగా చూచుకుంటే
పొరపాటున ఎప్పుడో ఎక్కడో ఒక కన్నీటిచుక్క
రాలి
జారికయి
నీ మూర్తి భవదానందమూర్తిని చిత్రంగా చీల్చి
ఒకనెత్తురు జీరనీ
ఒక గాయపు మచ్చనీ
ఒక విచార రేఖనీ
చివరికి తేల్చి చూపుతుంది.

సజల నయన సజీవ జలవర్ణ చిత్రమా నీకేనా శాంతిలేదా!
నీ ధగద్ధగిత మహా ప్రకాశమాన నేత్రాల్లో పీడ ఎట్నుంచెపుడు పడింది!
అలా నిశ్శబ్దంగ క్రూరంగ ప్రాకిన క్రీనీడని ఏ వెలుగు వెల్తురు మెరుపు చూపిందినాకు!

రంగు రుచి వాసన రూపం అన్నీ భ్రాంతి
ఆనంద దుఃఖాలరేఖ మహానిశితం. సౌదామనీ రేఖ మహాస్నిగ్ధం.
చీకటి నుదుటిని చీల్చే అసిత ఖడ్గం కుంచె.
మనకు ఏదైతే కన్పిస్తూన్నట్లుంటుందో అది రంగు.
రంగు రుచి వాసన రూపం అన్నీ ఒకేభావం.

— వేగుంట మోహనప్రసాద్

# ఈ చిహ్నం ఏమిటో ?




ఈ చిహ్నం ముద్రించబడిన వస్తు సామగ్రులు లభించిన పక్షాన్ని,
ధీమాగా నమ్మదగ్గ విషయాలు ఏమన:

- ఈ వస్తు సామగ్రులు భారతీయ మానక్ సంస్థ వారి పరీక్షకు లోనై, ఉత్తీర్ణత పొందినవనియూ,
- వాటి నాణ్యతకు భారతీయ మానక్ సంస్థ వారు హామీ ఇస్తున్నారనియూ,
- వాటి నాణ్యతలో ఒకవేళ లోటుపాటు కనిపిస్తే వాటిని బదిలీపరిచి మంచి సామగ్రి భారతీయ మానక్ సంస్థ వారు ఇప్పించగలరనియూ.

## కాబట్టి మీ కర్తవ్యం ఏమనగా:

- ఈ ISI ముద్రగల వస్తు సామగ్రినే కొనుటయూ, కోరుటయూ,
- ఈ ISI చిహ్నం లేని వస్తు సామగ్రి భారతీయ మానక్ సంస్థ వారి ప్రమాణ ముద్రికకు చెందలేదని భావించుటయూ,
- ఈ ISI ముద్రగల సామగ్రిలో ఏ లోపము గోచరించినా, ఈ దిగువ వివరించిన చిరునామాలలో ఏదో ఒకదానికి ఆ విషయం తెలియజేయు బాధ్యతయూ.

ఈ విధంగా మీరు తమంతట తాము సహాయం పొందడమే కాక, ఇతరులకుకూడ సహాయకారులవుతారు.

**ISI భారతీయ మానక్ సంస్థ | INDIAN STANDARDS INSTITUTION**

మానక్ భవన్, 9 బహదూర్ షా జాఫర్ మార్గ్, న్యూఢిల్లీ-1

బాంబే మ్యూచ్యుయల్ టెర్రేస్, సాండ్‌హర్ట్స్ బ్రిడ్జి. బొంబాయి-7

5 చౌరంగీ అప్రోచ్, కలకత్తా-13

117/418 బి, సర్వోదయ నగర్, కాన్పూర్

54, జనరల్ పటర్స్ రోడ్ మద్రాసు-2

స్కెచ్ :

# చరిత్రలో నిల్చినది

బలివాడ కాంతారావు

ఒక దేశస్థులను పొరుగుదేశస్థులు మిత్రులుగానే కనిపించారు. వాళ్ల తీపి తీపి మాటల్లో తేనెను గ్రోలారు. వాళ్ల స్నేహానికి ముగ్ధులై రెండు చేతులూ చాపి చాపి, వాళ్లను కౌగలించుకొని "మనం మనం సోదరులం" అన్నారు. వాళ్ళ కష్టకాలంలో మాట సహాయమే కాకుండా, తిండీ, డబ్బూ, వస్తువులూ పూరకనే కుమ్మరించారు. ఇది విడిపడని బంధం అనుకున్నారు. మనకెవరూ శత్రువులు లేనప్పుడు మనకు ఆయుధాలు యెందుకు ? మందుగుండు గిడ్డంగులెందుకు ? అసలు యింత డబ్బు యీ పటాలంపై యెందుకు తగలెట్టడం ? బలమైన దేశమంటే, కండగల మనుష్యులు. స్వేచ్ఛావాతావరణంలో కోరికలు తీర్చుకోగల ప్రజ, సర్వజనులు సుఖించే సాంఘికవ్యవస్థ. సైన్యాన్ని తగ్గించి, ఆ మిగిల్చిన డబ్బుకలిపి అందమైన కట్టడాలు, ప్రజలకు నిత్యం వాడుకోడానికి అవసరమైన వస్తువులు తయారుచేసే కార్ఖానాలు, విద్యను, విజ్ఞానాన్ని యిచ్చే సంస్థలూ, ఆహారోత్పత్తికి దోహదం చేసే డాములూ, యెరువుల ఫ్యాక్టరీలూ, రహదార్లూ, కళాకేంద్రాలూ పరిశ్రమలు, విద్యుత్కేంద్రాలు సాంఘిక వ్యవస్థకు పునాదుల్లా కట్టుకుంటున్నారు.

ఈ క్రొత్తగా వేసుకుంటున్న సాంఘిక పుద్యానవనంలో అక్కడక్కడా మొక్కలు పెరిగి పువ్వులు పూస్తున్న సమయంలో చెదురు చెదురుగా పశువులు చొరబడి యీ పచ్చని కొమ్మలనూ రంగు రంగు పూలనూ మేయసాగాయ్. వాటిని తోలడానికి కేకలు వేసుకు వెళ్తే, అవి కొమ్ములతో పొడవడానికి వచ్చాయ్. ఆ వాడి కొమ్ములు తుపాకులై పేలాయ్. ఈ ఉద్యాన వనానికి ముళ్ళకంచే వెయ్యలేదని ఈ దేశస్థులు గ్రహించారు. గడ్డిమేయడానికి కాకండా పుద్యానవనాన్ని కుమ్మి పాడుచేయడానికే యీ పశువుల మందలు, కావాలని పొరుగు దేశస్థులచే విడిచిపెట్టబడినవని యీ దేశస్థులు పోల్చుకున్నారు.

ఇలాంటి సుందర సీమలు వాళ్ల రాజ్యంలో వుంటేగా ?

" ఓ మిత్రుడా ! ఇది నీకు న్యాయమా ? '' అని దేశ ప్రజంతా ప్రశ్నిస్తే—

" అవ్వే మాకు తెలీదు—మాకు తెలీదు. మీ పశువులే పాడు చేసుకున్నాయ్. " అన్నారు.

ఉన్న కొద్ది తీగతో ముళ్లకంచె వెయ్యడానికి ప్రయత్నిస్తుంటే తెల్లవారేసరికి వేసిందంతా పూడపీకి వుంది.

" ఇలా పూడపీకటం న్యాయమా మిత్రుడా " అని అడిగితే—

" మా జాగాలో వేస్తే పూడపీకకుండా వుంటామా ? '' అన్నారు.

ఈ జవాబుతో యీ దేశ ప్రజలంతా దిగ్భ్రాంతి చెంది " ఇది మీ జాగాయెలా ? '' అన్నారు.

" అది మా జాగాయే. మీరు వేసిన పుద్యానవనంలో మూడోవంతు మా జాగా—మా జాగా మాకు వదిలేసి మీ జాగాలో కంచె వేసుకోండి. ''

" కావలిస్తే మీదన్న జాగా మాదేనని అధారాలన్నీ చూపిస్తాం. ఒక పెద్ద మనిషి దగ్గర పెడదాం. "

పొరుగు దేశస్థుడు నవ్వి ఇలా దబాయించి యెందరి జాగా కలుపుకుంటూ వన్నాడు.

ఆ తరువాత పుద్యానవనంలోనికి షికారుకు మనుషుల్ని కాదు తుపాకి కొమ్ములున్న పశువుల్ని పంపించాడు. ఆ పశువులు రానురాను లోనికి చొచ్చుకొనిపోయి అందమైన పూలమొక్కలను కొమ్ములతో ధ్వంసం చేస్తున్నాయ్. ఆ యెద్దులను తరమడానికి వీళ్ల యెద్దులను పంపిస్తే రెండూ వీళ్ల జాగా మీదే పోట్లాడి, వీళ్లు యిన్నాళ్లూ యెండనక వానసక, చలినీ ఆకలినీ మరచి ఆశతో సృష్టించిన యీ మనోహరమైన పూలతోట నిష్కారణంగా మట్టిపాలౌతుందని ఒర్పుతో, బాధతో మళ్లీ బ్రతిమాలారు.

ఈ శాంతి ప్రతిపాదనలు వీళ్ళ పిరికితనానికి చిహ్నంగా తీసుకుని, ఆ పొరుగు దేశస్థుడు అవమానకరమైన భాషలో ఆవేశంతో మాటాడి సవాలుచేసాడు. రాయబారానికి వెళ్లిన వ్యక్తులు యింకా తిరిగిరాకుండానే ప్రచ్ఛన్నయుద్ధాన్ని, పెద్దపెట్టున జరిగే పోరాటంగా మార్చాడు.

ఈ పొంచియెగిరిన యీ చిఱుతపులి గెంతుకు యీ దేశం తట్టుకోలేకపోయింది. దేశం యుద్ధానికి సంసిద్ధంగాలేదు. ప్రజలు శాంతియుత జీవనానికి అలవాటు పడిపోయారు. హింసను నిత్య

జీవితంనించి తొలగించడానికి ప్రయత్నిస్తున్నాళ్లకు సంపదతో కూడుకున్న యుద్ధం చెయ్యడాన్ని తొలుత మనస్కరించలేదు వారు కోరని రక్తపాతాన్ని పోరుగువాడు ప్రవేశపెట్టినప్పుడు అదే విధంగా యెదురొక్కటటం తప్పింది యింకో గత్యంతరం లేకపోయింది.

వీళ్లకు కోటలులేవు. శతఘ్నులు అమర్చడానికి బంకర్లు లేవు. దేశరక్షణకు అవసరమైన అంగబలం లేదు. ఇవి యింద్రజాలంతో సృష్టించబడేవికావు శత్రువు యుద్ధానికి అన్ని సన్నాహాలూ గుప్తంగా చేసుకునే, రంగంలోనికి పురికాడు. శిక్షితులైన భారీ సైన్యం, సైన్యం పోరాడ్డానికి కావలసిన సరంజామా సమకూర్చుకున్నాడే గాని ఆ సరంజామాను వాడే మనుష్యుల్లో అవసరమైన ఆత్మ విశ్వాసంలో దరిఫీదివ్వలేదు ధర్మంగా పోనిదేశానికి ఆత్మ వుంటదు. ఆత్మలేని దేశంలో ఆత్మ విశ్వాసంగల మనుషులుండరు. తరిఫీదిచ్చి తయారు చేసినా పరీక్షాసమయంలో వాళ్ళు నిలవలేరు. ఏ ఒక్క దేశానికైనా ఆత్మ విశ్వాసం వుందని యేంచూసి చెప్తాం; ఆ దేశంలో ఒక వ్యక్తికి యింకో వ్యక్తిమీద వుండేనమ్మిక. అలాంటి నమ్మికే దైవతుల్యమైన సత్యంపై ప్రజలకు కలిగియుండుట—మనిషి యెదుట వాళ్లూ తనతోపాటు బ్రతకాలనే కాంక్షను కలిగి తదనుగుణంగా సంచరించుట.

ఈ దేశం యీ అపత్సమయంలో ధర్మానికి కట్టుబడి ఆత్మకలదైనది కొబట్టి ఆత్మ విశ్వాసంతో మెలగసాగింది. ఆత్మ విశ్వాసం గల మనుషుల పరమాత్మ అన్నట్లు వీరిలో ఒక నాయకుడు ఉద్భవించాడు. తన ధీరతతో వుత్తేజమైన నాయకత్వంతో ప్రజలను ఒక పెద్ద అయస్కాంతంలా ఆకర్షించాడు ఈ అయస్కాంతం ఆకర్షణ యెన్నో చిన్న చిన్న అయస్కాంతాల్ని సృష్టించింది. యుద్ధం తెచ్చిన చీకటిలో అతనో చంద్రునిగా వుదయించి అతనితో బాటు చుట్టూ మెరిసే చుక్కలను సృష్టించుకున్నాడు. ఆ చంద్రుణ్ణి ఆచుక్కల్ని తుడిచి పెట్టాలని శత్రువు యెంతో ప్రయత్నం చేసాడు.

వాయు, పదాతి, నౌకా దళాలతో ముందుగా రంగంలోనికి పురికిన శత్రువు వీళ్ల దేశంలోనికి చొచ్చుకు పోసాగాడు నౌకల నించి ఫిరంగులను పేల్చి ఓడరేవులను మట్టిపాలం చేసాడు ఆకాశం మీదనించి బాంబుల వర్షాన్ని కురిపించి, వీళ్ల కట్టుకున్న కార్ఖానాలూ, కళా కేంద్రాలు, రహదారులూ అన్నీ నేల మట్టం చేసి, పదాతి దళంతో శత్రువు ముందుకు సాగిపోతున్నాడు. మానవత్వంపై ప్రేమానురాగాలు చూపించాలని వందలాది సంవత్సరాలు చాటిన దేవాలయాలు నేలమట్టమౌతున్నాయి. కళాకారులు జీవిత కాలం చేసిన సాధనా, దృఢమైన మనస్సుతో చెక్కిన శిల్పాలు పిండి అయ్యాయి. కట్టడాల్లో యింకా పచ్చిగా వున్న వేలకొద్దీ పని వాళ్ళ చెమటను కొద్ది క్షణాల్లో మంటల్లో ఆవిరి చేసారు ఎంతోమంది విరిగి రక్తంతో కలుషితమైన ప్రవాహంలో కూలి పోతున్నాయి.

ఆ పరిపాలకుని ఒక్క భస్మాసురహస్తం మారణాయుధాలతో వేలాది హస్తాలై యెక్కడపడ్తే అక్కడ పడి భస్మం చేస్తోంది.

నగరాలు యిలుల్లూ భయపోతున్నాయి. కోట్లకొలది రూపాయల విలువచేసే ప్రజల ఆస్తి బూడిదై పోతోంది. ఈ దేశంలో కాటునేయుడు చేసి సికలాంగులు యీ యుద్ధంవలన రోజురోజుకూ వేల సంఖ్యలో పెరుగుతున్నారు. వేలాది సైనికులే కాకుండా లక్షలాది సామాన్యప్రజ చనిపోతున్నారు. ఆకలి. రోగాలు పెరిగిపోతున్నాయి.

ఇంత బీభత్సం జరిగినా యీ దేశంకా ఆజ్ఞా వూబిలో పడి మునగలేదు. యేనాయనే మళ్లీ కాళ్లు నిలదొక్కుకుంటోంది ఎదరగా గట్టి జాగామూసి కాలు పెట్టోంది. వీలులేకపోతే వెనుకకు ఒక అడుగు వేస్తోంది ఒకసారి వెనుకకు ఒక అడుగు వేసాక రెండోసారి ముందుకు రెండడుగులు వేస్తోంది. దీనికి కారణం యీ దేశప్రజల్లో యిత్తుదుచూపిన కృతఘ్నత. వెనుకపోటూ ప్రాణాలను తెగించే నటనలను సృష్టించింది. ఆపట్టుదల వీరత్వమైంది ఈ వీరత్వమనే బంగారు పళ్లానికి గోడలా ధర్మమే ఏనాటికైనా జయిస్తుందన్న విశ్వాసం అండగానిల్చింది. ఆ విశ్వాసమే వాళ్లను చీకటిలో వెలుగును చూసనిచ్చింది. పోరాడేగుండె నిబ్బరాన్నిచ్చింది. ఇలా వచ్చినధైర్యంతో ఓర్పుతో, ఆశతో తమ మాతృభూమిలో ప్రతి ఒక్క అంగుళం కోసం హోరాహోరీ పోరాడారు. అది ఒక జాతి పర్వతంలాంటి దృఢ సంకల్పానికి యింకో జాతి గాలి బుడగలాంటి దురాశకూ సంఘర్షణ ఎగిరే గాలిబుడగకు విసిరే సూదులు తగలకపోయినా యెప్పటికైనా అది దిగువకు దిగజారిపోతుంది

శత్రుసైన్యాలకూ ఒక మనసేకాదు హృదయంకూడావుంది ఇన్నాళ్లూ హృదయస్పందన వాళ్ల చెవులకు వినిపించలేదు. అన్నీ విజయాలే కాంక్షించిన వాళ్లు, ఒక్కసారి పరాజయంలో గడగడలాడారు అప్పుడు తొలిసారి వారి హృదయస్పందన వాళ్లకు వినిపించింది. ఆ స్పందనను అర్థంచేసుకుంటే యెన్నెన్నో ప్రశ్నలుంటాయి. ఇదివరకు వాళ్లలో పాప పంకిలమైన కోర్కెలు వుదయించినంత వడిగా వాళ్ల తుపాకులు పేలి బీభత్సంచేశాయి. ఇప్పుడు అటునించి పేలిన తుపాకులవలన చచ్చిన వారిని చూడగానే శత్రువులలోనూ శ్మశాన వైరాగ్యం వచ్చింది. అనుకున్నట్లు జరిగే అవకాశం కానరాకపోగానే శత్రుసైనికుల్లో అలజడి ప్రారంభమైంది వాళ్ల యుద్ధపరికరాలు పిచ్చివాళ్ల చేతుల్లో రాళ్లల్లామారాయి. ఆ యుద్ధ పన్నాగాలు తమపై తామే వేసుకున్న పన్నాగాలయ్యాయి ఒక విధానంతో ఆరంభం యిష్టమొచ్చినట్లు ఆయుధాలు వాడగానే తిరిగి అంత నగరునించే అవమానాలు సన్నగిల్లాయి రానురాను సరైన ఆహారం బట్టా, మందూ దొరకనపోగానే వాళ్ళ ప్రభుత్వంపై వాళ్లకే జుగుప్స జనించింది. బహుశః తమ కుటుంబాలగతి యింతకంటె అధ్వాన్నంగా వుంటుందన్న అనుమానం వాళ్లను పిరికివాళ్లను చేసింది. వాళ్లగురించి వాళ్ల యజమాని చెప్పేమాటల యందు నమ్మకంపోయింది. వీళ్లందరికీవున్న ప్రయోజనం ఒకటే. అది ఒక దేశాన్ని దోచుకుని పాలించటమని. అది ఒక సుకృతమైన పనికాదు. ఒక మంచి తలపుకాదు. దానికి త్యాగం అక్కర్లేదు ఈ దేశస్థులకు అటువంటి చెడు తలపులు లేవు. దేశాన్ని తమ త్యాగంతో రక్షించుకున్నారు.



# స్త్రీశిశుసంక్షేమం

స్త్రీ అనగానే పలు విధాల వ్యక్తులకు పలువిధాల మూర్తి గోచరింపవచ్చు. కొందరికి ప్రణవస్వరూపిణిగా స్త్రీమూర్తి కనులముందు గాన్పడవచ్చు. ముక్కోటి దేవతలు మ్రొక్కి, అమ్మా! శాంకరీ! అసురులదునుమాడి మమ్ముల గాపాడవమ్మా, అని వేడుకోబడిన ఈశుని సగభాగమై వెలయు దేవి గోచరింపనూవచ్చు. అలనాడు హిమగిరి తనయ అపర్ణయై ఘోరతపమొనర్చి, మహేశునిపొందిన ప్రణవ మూర్తి గాన్పించనూవచ్చును.

స్త్రీ శక్తి స్వరూపిణి గనుక, ఆమె మహిషాసుర మర్ద నియై రక్కసుని పీచ మడచి, ప్రళయ స్వరూపిణియై నిలచిన రాజ రాజేశ్వరి, చాముండిక దృగ్గోచరింపవచ్చు కొందరికి.

మరికొందరికి స్త్రీ ముగ్ధమోహన ప్రణయసుందరిగా, అందాలగుమ్మగా, ఆటబొమ్మగా గన్పడవచ్చు. ఏది ఎటు లున్నా, ఎవరెలా భావించుకున్నా పరమాత్ముని లీలలో స్త్రీ ప్రకృతి. సృష్టిరహస్యానికి మారుపేరు, సృష్టికర్త. క్షమాది త్యాగగుణములకు పుట్టిల్లు, దాక్షిణ్యమూర్తి. ఎలాగంటా రేమో? స్త్రీ ఆకర్షణీయమైనదిగనుక ప్రకృతి. క్షమాది గుణములు గలదిగనుకనే ఒక యింటపుట్టి, మరోయింట మెట్టి, ఆ నూతన పరిసరాలను అవగాహన చేసుకుని, అలవాటుపడి, ఎన దాక్షిణ్య లాలిత్యంతో అచ్చటివారిని గెలిచి, తన నాథుడే దైవమని భావించి, మాతృమూర్తిగా సృష్టికార్యాన్ని సఫలం చేసి తన నాథునికై, తన చిన్నారులకై తన జీవిత సర్వ స్వాన్ని అంకితంచేయు స్త్రీ త్యాగమూర్తి! ఇంతగూఢార్థ యుక్తమగు స్త్రీ జీవితము పుట్టినదాది గిట్టువరకు, సక్ర మంగా కాలచక్రంలో దొర్లితే, ముందు పువ్వులు, అరు కాయలుగా వుంటుంది. పెద్దలు వక్కాణించినట్టు, 'బాల్య కౌమార్యంలో తండ్రి ఆధీనంలో, యౌవనంలో భర్త సొత్తుగా, వయోధికతలో పుత్రుని రక్షణలో —యిలా అన్ని దశలలో లలాటరేఖలు శోభిల్లుతూవుంటే, స్త్రీజీవితం స్వర్గ ధామమే! పైదశలలో ఎలా రేఖలు వక్రించినా స్త్రీ జీవితం నరకకూపంగా మారుతుంది.

అన్నివిధాల అదృష్టశాలినులు ఎవరో, ఎప్పుడో, ఎక్కడో కని పోలేము. భర్త అర్ధశరీరానికి నోచుకున్న గౌరి, భర్తృ వక్షస్థలాన్నే గూడు కట్టుకున్న సిరి, పురాణా లోని, మాతామహిళలు, ప్రణయరూపిణిగా మొగల్ సామ్రాట్, పాదుషాను వరవశింపజేసి తాను మరణించినా, తాజ్ ధవళ కాంతుల్లో ఆచంద్రార్కం ప్రేమ చిహ్నంగానిలచి, ప్రణయ సామ్రాజ్యానికే తన నాథుని సామ్రాట్‌ని చేసిన పుణ్యవతి ముంతాజ్ బేగం!

అనంత ఆనందడోలికల్లో తేలినడయాడే సువాసినులు లేకపోలేదు. అయితే, అందరూ పల్లకి ఎక్కితే మోసేవారో అన్నట్టు, కొందరు పైజెప్పిన ఏదో ఒక దశలో అదృష్టాన్ని గోల్పోయిన అభాగినులుంటారు. దేశకాల పరిస్థితులు మారుతూవుంటే సామాజిక వ్యవస్థలు, సాంఘిక విలువలు మారుతూవుంటాయి. ఈ మారే విలువలు వాటి ప్రభావము ఒక్కొక్కసారి సంఘంలో కొందరిపై తీక్షణమై కరకు మొనగల యినపగొడ్డలిలా తయారౌతవి. ఆజీవులు తమ బాటలో వేసే ప్రతి అడుగూ గమనించబడి, విమర్శించబడి, నిందింప బడి, జీవితంలో విసిగివేసారి సంఘాన్ని రోసి ఎదురుతిరిగే విషమపరిస్థితులకు దోహదమిస్తుంది. పతనావస్థకు నాంది కల్పిస్తుంది.

పూర్వం యిలాంటి అభాగినులను ఆదరించేందుకు సమిష్టి కుటుంబాలు వుండేవి. నేడు పల్లె పట్టులలో కుటుం బాలలో జనాభా పెరగడం, అచట జీవితం దుర్భరం గావ డము, పొట్టచేత బట్టుకుని పట్టణ వాసాలకు తర్లడము జరుగు తోంది. చీలిపోయిన ఆకుటుంబాలలో అభాగినులు, ఎవరిసొత్తూ కానట్టే భావింపబడు తున్నారు. ఇలాటివారికి ఎంతో వుప కారం కావాలి. మానవులుగా మనుటకు స్థైర్యధైర్యాలు వారికి కల్గచేయాలి. నైతిక పథాన్ని వీడకుండా మనోబలాన్ని ప్రబోధించాలి. అమాయకపు తనంవల్లనో, ఏ వత్తిడివల్లనో పతనం చెందినవారిని మరీ అధోగతికి దిగజారకండా పునరా వాస సౌకర్యాలు కల్పించి సంఘంలో వ్యక్తులుగా పునః సృష్టికరించాలి. పొడిగా నాల్గు మాటల్లో వ్రాసిన యీ పథకం లోతుగా ఆలోచిస్తే, ఎన్నో ప్రణాళికల ఫలితంగా వచ్చే పరిణామమే గాని, ఒక రోజులో వచ్చే మార్పు మాత్రము కాదు.

ఇట్టి అభాగినుల వుద్ధరణకై ప్రథమ పంచవర్ష ప్రణా ళికలో పొడచూపి, ద్వితీయ ప్రణాళికలో స్థానమేర్పరచుకుంది స్త్రీ సంక్షేమశాఖ ప్రప్రథమంగా మనరాష్ట్రంలో. 1954-55 లో శ్రీమతి ధన్వంతరీ రామారావు కమిటీ నివేదికననుస రించి సెంట్రల్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డు ఒక పథకాన్ని

తయారించి రాష్ట్రస్థాయిలో 3 స్టేట్ హోంసులు, జిల్లా స్థాయిలో జిల్లాకొక షెల్టర్ వుండాలంటూ సిఫారసుచేస్తూ దేశం మొత్తంనుండి కొద్దిపాటి మహిళలకు సాంఘిక నైతిక సూక్తులతోపాటు వివిధ విషయములలో బహుళార్థ శిక్షణనిచ్చి వివిధ రాష్ట్రములందలి సంస్థలను జూపి, 'థీసిస్' వ్రాయింప జేసి, మహిళాజన వుద్ధరణలో దిట్టలనుజేసి, వుత్తీర్ణులైన వారిని, వారివారి మాతృభాషానుసారముగా వివిధ రాష్ట్రములలో నియమించి సంస్థలను స్థాపింప నేర్పాటుజేసిరి. ఇట్టి స్టేటు హోంములు 1957-58లో రాజమండ్రి, హైదరాబాదునందు 1959లో కర్నూలునందు, 1961లో తృతీయ ప్రణాళికలో మహబూబ్‌నగర్‌నందు స్థాపించుట జరిగినది. ఈ హోంములందు భర్తృవిహీనులు, భర్తృపరిత్యక్తలు, వీరేకాక ఏ పరిస్థితుల ప్రభావమువలననో నైతిక పతనముచెంది, తమ పొరబాటునుగ్రహించుకుని తగువారి చేయూతతో తమ జీవితమును పునఃసృష్టికరించుకొన దలచినవారికి, తావు యీయబడును. అట్టివారు కోల్పోయిన మానసిక, నైతిక బలమును సమకూర్చి, అనారోగ్యానికి తగువైద్య సహాయమిస్తూ, విద్యావకాశములు, వృత్తివిద్యావకాశములు కల్పిస్తూ వారిలో ప్రగతి కన్పడిన వెనుక 3 సం॥ అనంతరము వారిని సంఘంలో జీవులుగా పునఃప్రతిష్ఠించుట యీ స్టేట్ హోంముల పునీత కార్యము.

ఆద్వితీయ ప్రణాళికయందే స్త్రీసంక్షేమశాఖయందు సర్వీసు హోంములు వుద్భవించినవి. ఆర్థిక స్థోమత లేక మాన మర్యాదల దృష్ట్యా లోలోన కుములుచూ అనేక బాధలతో కృంగి కృశించే భర్తృవిహీనులు, భర్తృపరిత్యక్తలు, అనాదులు అగు స్త్రీలకు, వారి పసిబిడ్డలకు కూడ ఆశ్రయముకలదు. యీసంస్థలలో వారికి విద్య, వృత్తి విద్య నేర్పి వుపాధికల్పించుకోగల స్వశక్తి రాగానే మూడుసంవత్సరములలో పునరావాసము కల్పించబడును. ఈ హోంములు రాష్ట్రమందు హైదరాబాద్, వరంగల్, అనంతపురం, కర్ణాపురం, విజయవాడలందు గలవు.

పై పేర్కొనబడిన రెండుతెగల సంస్థలందు అభాగినీ స్త్రీజనానికి తిండి, గుడ్డ, ఆశ్రయము, విద్య పునరావాసము ప్రభుత్వ బాధ్యతతో యీయబడుచున్నవి. పై సంస్థలలో వివిధవృత్తివిద్యలు నేర్చుకొనుటకు అవకాశమున్నది. సైకిల రింగు, గాజు ఆంప్యూల్ తయారీ, రంగు చాక్‌పీసుల తయారీ కాగితపు సంచులతయారీ, చాపల అల్లకము, ఫేము అల్లకము కాన్‌వాస్ సంచులు, హోల్డాళ్ళతయారీ, బనీన్లు, సాక్సుల తయారీ, దూదిబొమ్మల, చెక్కబొమ్మల తయారీ మొదలగు వృత్తి విద్యలకు నిలయములై యున్నవి. పై పేర్కొన్నవి సంస్థలు ఇవికాక వృత్తి శిక్షణా కేంద్రములలో టైపు, షార్ట్ హాండ్, కమర్షియల్ సబ్జక్టులలో తర్ఫీదుపొంది పరీక్షలకు హాజరగుచున్నారు. ప్రస్తుతము యిట్టి సంస్థలు అనంతపురం కడప, కర్నూలు, ఏలూరు, శ్రీకాకుళం, హైదరాబాదు, వరంగల్ లందుగలవు.

ఈ శాఖ ప్రత్యేకించిన కొన్ని స్కీములలో బ్లాకులలో, పట్నాలలో కుట్టు నేర్పించు కేంద్రాలు వున్నవి. ఈ కేంద్రాలలో కుట్టు నేర్చుకొని తద్వారా సర్టిఫికేట్ పొందు స్త్రీలు వుద్యోగాలకై అర్హులు కాకపోయినా, యింటికి కావలసిన దుస్తులను తామే కుట్టుకునేంతటి సమర్థులుగా తయారౌతూన్నారు. ఇపుడు జిల్లా స్థాయిలో రెండు కుట్టు కేంద్రాలు స్థాపించ బడినవి. ఒకటి సికింద్రాబాదులో మరొకటి కడపలోను గలవు.

శాఖనందలి సంస్థలద్వారా మాత్రమే కాకుండా విద్య నభ్యసింప లేనివారు, వయసుమీరినవారగు పల్లె స్త్రీలకు, నిరాధారులైనవారలకు ఒక్కొక్కరికి 200 రూ. నుండి 250 ల వరకు ధనము మంజూరు చేయబడుటచే అట్టివారు వారి అర్హతనుబట్టి కుట్టుమిషన్‌గాని, గేదనుగాని కొని జీవిక నడిపుకుంటారు.

స్త్రీ సంక్షేమానికి శిశు సంక్షేమానికి, అనుబంధమున్నది. అదేకాక శిశుసంక్షేమములేక సంఘ సంక్షేమమే శూన్యము. కారణము! నేటి పసివారే రేపటిపౌరులు! పాపాయి ప్రపంచంలోకి రాకముందు 40 వారాలపాటు మాతృగర్భంలో దినదిన వృద్ధిగాంచుతూ తన జనని రక్తాన్ని పంచుకుని, తన చిన్నారి చిద్విలాసంతో తనతల్లిని వ్యామోహంలో తేలి ఆడిస్తాడు. నిర్ణీత కాలంలో నిర్దాక్షిణ్యంగా, స్వార్థానికి చిహ్నమన్నట్లుగా, యిన్నాళ్లు ప్రాణప్రదంగా తనలో యిముడ్చుకొని కాపాడిన మాతృదేవిలో భూకంపం బోలిన కంపనాన్ని కల్గించి జననమందడం జరుగుతుంది. అందుకే "జననీ, జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి'' అని కోవిదుల వాక్యం ఆవేళల్లో పడ్డ వేదన, పసిపాపాయి అమ్మా! అంటూ తనకెవ్వరో నేర్పించినట్లు, ఆపరమాత్మ ప్రబోధంతో కెవ్వుమనగానే మాతృహృదయం వుప్పొంగి పోతుంది. మెత్తని పొత్తిళ్లలోకి తీసుకని, అమందానందము పొందుతూ పొంగి పొరలే చిహ్నమైన స్తన్యమిచ్చి కాపాడుతుంది. ఆపొత్తిళ్లలో, ఆ హస్తాలలో, ఆ వెచ్చని స్పర్శలోకల సౌఖ్యం, ఆ భద్రత చూరగొన్న శిశువు తన తల్లే తనకు శ్రీరామరక్ష అనుకుంటాడు. ఇట్టి రక్ష, భద్రత తలిదండ్రులనుండి, ఆ శిశువు పెరిగి పెద్దై తానొక వ్యక్తిననే వ్యూహం వచ్చేవరకూ వుండాలి. ఎంత పెద్ద వృక్షమైనా మొదట చిన్న మొలకగానే పుడుతుంది. శిశువు పుట్టగనే జాతి, తెగ, మతం యిలాంటి భేదాలు తెలియవుకదా! బిడ్డ పెరుగుతూ తన తల్లిదండ్రులనీ, తన యిల్లనీ, గ్రామమనీ యిలా తెలుసుకుంటూ పోతాడు. ఈ విషయాలు తన తల్లిదండ్రులవల్ల, పరిసరాలవల్ల తెలుసుకుంటాడు. కాని యిలా తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోనని ధూళి పుష్పాలను బోలిన బిడ్డలు, యిరువురి ప్రేమలో ఏ ఒకరి ప్రేమగాని లోపించిన బిడ్డలలో ఒక విధమైన మానసిక వ్యధ గోచరించడం గమనార్హం. మాతాపితల నెరుగని భారత కర్ణుడు యీ కోవకు చెందినవాడు. అష్టైశ్వర్యాలు వున్నా, అంగరాజ్యాన్ని పాలించినా తీరని మానసిక బాధ ననుభవించిన దైన్యజీవి. మొక్కవోని శౌర్యము గలవాడుగాని మానసికంగా

ఎం'ప్రస్తే అనిసి మనసే ఒక సమున్నతమైన ప్రాసలం, అగ్ని బాంధవ్యాలకు పుంటుందని తోచే వారు

కావున తెలిసివచ్చేదేమనగా బిడ్డలకు రక్షణ, భద్రత సంతృప్తి అవి అని వారికి తెలియపచ్చేలాగా తల్లిదండ్రుల, పోషణకర్తల బాధ్యత ఎంతైనా అవసరం. ఇట్టి భద్రత యివ్వని బాల బాలురను పెంచని యెడల వారిలో నిరాశ, నిస్పృహ పొడచూపి ఉక్కు రాజ్యాంగ చట్టాలనే ధిక్కరించే వ్యక్తులుగా తయారు కాగల రనుటలో సందేహము లేదు. వారిని చక్కని మార్గాలకు మలచి సరిదిద్ద వలసి బాధ్యత ప్రభుత్వానికికూడా వుంది. కావున పిల్లల ఆరోగ్య, మానసిక వికాస కార్యక్రమాలకు ప్రాధాన్యమివ్వ బడుతోంది. బాల్యంనుండే మానవులంతా ఒకటే అనే అభిప్రాయం కల్గించాలి. సాధించవలసిన లక్ష్యం యిదే! UNICEF రెండు దశాబ్దాలుగా కృషి చేస్తూన్నారు. పిల్లలు చక్కని వాతావరణంలో పెరిగితే, వారు క్రమబద్ధులై పెరిగి పెద్ద వారై విశ్వశాంతి దూత, అమరజీవి జవహర్ నెహ్రూ కలలను పండిస్తారు

సమాజానికి యీనాడు నిర్వచన మక్కరలేదు. సమగ్రము, సమైక్యము అయిన ప్రగతికి దోహదం కల్గచేయ డమే సంక్షేమ లక్ష్యం. ఆర్థికంగా వెనుకబడ్డ తరగతుల్లోని పిల్లలకు కనీసావసరాలెన్నో లోపిస్తాయి. తల్లిదండ్రులు పొలాలకో కర్మాగారాలకో పనిలోకి వెళ్లినప్పుడు బిడ్డలను చూచుకునేవారు లేకపోవడము యీ బిడ్డలు దురలవాట్లు నేర్చుకోవడము జరుగుతున్నది ఇలాంటివారు పెరిగి పెద్ద వారైనపుడుకూడా సహజంగా తప్పు త్రోవనే వెదుకు తారు. ఆర్థికంగా పురోగమించిన వారి బిడ్డలు సాటివారిని తమ సమానులుగా భావించక పై అంతస్తువార మనే అహముతో వుంటారు. ఇలాంటి భేదాలను తొలగించా లనే ఆకాంక్షతోనే స్త్రీ సంక్షేమశాఖ 35 శిశు విహారముల నెలకొల్పింది. ఈ సంస్థలలో 5, 6 సం॥ లోపు వయసుగల బిడ్డల తల్లిదండ్రులు పనికిపోయినప్పుడు చూచు కునేందుకు ఏర్పాట్లు చేయబడినవి. పసిపాపలకు పాలు, ఎడపిల్లలకు భోజనము. నిద్రించుటకు ఊయలలు, ఆడుకొను టకై ఆట వస్తువులు, స్నానాది వసతులు, దుస్తులతో సహా అనేక ఏర్పాట్లు చేయబడినవి.

ఆర్థిక స్తోమత లేనివారల బిడ్డలకు విరామ కాలంలో దురభ్యాసాలకు లోనుగాకుండా, వినోద వికాస కార్య క్రమాల ద్వారా ఆరోగ్యాన్ని, నడవడికను తీర్చి దిద్దేందుకు బాల విహారాలనే సంస్థలు నడుప బడుతున్నాయి. UNICEF, CARE లాంటిసంస్థలు పై 28 సంస్థలకు తేలిక ఫలహార సదుపా యాల్ని కల్గిస్తున్నాయి.

ఇవి కాక జిల్లాలో రెండు చొప్పున బాలబాలికలకు వసతి గృహాలు పై శాఖ అధ్వర్యంలో నడుపబడు తున్నాయి. వీనిలో ఆర్థికంగా, సాంఘికంగా లోటుబడిన బాలురైతే 10 సం॥ లోపు వరకు, బాలికలయితే 18 సం॥ లోపు వరకు విద్యా బుద్ధులతో వృద్ధి చెందుతారు. ఈ సంస్థలు యీ క్రింద చూపబడిన స్థలములలో నున్నవి.

శ్రీకాకుళం, బొబ్బిలి, భీమునిపట్నం, రాజమండ్రి, అనకాపల్లి, అడ్డతీగెల, తణుకు, నూజివీడు, మచిలీపట్నం, గుంటూరు, బాపట్ల, నెల్లూరు, గూడూరు, మదనపల్లి, కాళహస్తి, పెద్దపాడు, హిందూపురం, ధర్మవరం, కడప, సిద్దవటం, హైదరాబాద్, వికారాబాద్, వరంగల్, జనగాం, నిజాంబాద్, కామారెడ్డి, ఆదిలాబాద్. పటన్‌చెరు, సిద్దిపేట, ఖమ్మం, భద్రాచలం, నల్గొండ, భువనగిరి, కరీంనగర్, జగత్యాల్ మహబూబ్‌నగర్.

బాల సదనాలలోని బాల బాలికలకు తిండి, గుడ్డ, విద్య పుస్తకాది పరికరాలు వుచితముగా యీయబడి బడికి పంపించి విద్య నేర్పించుట జరుగుచున్నది. తల్లిదండ్రులు లేక గాని, తల్లిగాని తండ్రిగాని మరే పోషకులుగానిలేని బాల బాలికలకు ఆర్థికముగా వెనుకబడిన వారికే యీ సదనము లలో చేరుటకు అర్హతగలదు. ఈ సం॥బాల సదనమందలి ఒక విద్యార్థిని . లో చేరినది.

ఇట్టి సంస్థలు ప్రస్తుత సాంఘిక పరిస్థితుల దృష్ట్యా యింకా ఎన్నైనా అవసరం. సమానావకాశాలు ఏర్పడిన నాడే యీర్ష్యా, జుగుప్సలకు తావులేని విశ్వ సౌభాత్రృత్వం పసితనం నుండే పెంపొందే సదవకాశం గలదు. అపుడు భావి భారత పౌరులగు నేటి బాల బాలికలు విశ్వ శాంతి సాధము నకు పునాదులగుటకు సందేహమే లేదు. నవనవోన్మేషమగు పారిజాతాలు పరిమళించే ఆ నందన వనంలో విహరించేది వారేగా!!!

ఈ శాఖ గ్రామ స్థాయిలో, బ్లాక్, జిల్లా, మండల, రాష్ట్ర స్థాయిలలో దేశ కాల పరిస్థితుల ప్రవాహంలో ఝురీ తుల్య వేగంతో పయనిస్తూ, మహత్తర ఆశయాలను అందుకో వాలని సర్వతోముఖ కృషి చేస్తూ, ముందుకు సాగుతూ వుంది.

# మన రైల్వేలు-స్వయంసమృద్ధి సాధన

జి. డి. ఖండేల్‌వాల్
రైల్వే బోర్డు అధ్యక్షుడు

*ఈనాడు మన రైల్వేలు ఆవిరితో నడిచే యింజన్లు, ప్రయాణీకుల పెట్టెలు, సరకులను వేసే వాగన్లు, రైలు పట్టాలవంటి సామగ్రి, సిగ్నలింగ్ పరికరాలువంటి వాటి విషయంలో స్వయంసమృద్ధిని సాధించాయి. అంతే కాదు యీ సరుకు సామగ్రులను కొన్ని విదేశాలకు ఎగుమతి చేస్తున్నాముకూడా.*

భారత దేశంలో రైల్వేలు సాధించగలిగిన అభివృద్ధి అంతటిలోకి స్వయం సమృద్ధిని సాధించే విషయంలో జరిగిన కృషిని చూపగలిగిన ప్రగతిని ప్రధానంగా చెప్పుకోవలసి ఉంటుంది. మన రైల్వేల చరిత్రలో సువర్ణాధ్యాయంగానే దీనిని పరిగణించవచ్చు కూడ. ఒకానొకప్పుడు రైల్వేలు, అవసరమయిన ప్రతిదానికీ దిగుమతులపైనే పూర్తిగా ఆధారపడవలసివస్తూండేది. అలాంటిది ఇప్పుడు పరిస్థితి బాగా మారిపోయింది. అవసరమయిన సరకుసామగ్రిలలో చాలా హెచ్చుభాగం యిక్కడ మనదేశంలోనే తయారు చేసుకో గలుగుతున్నాము. అంతేకాదు, చెప్పుకోతగినంతగా ఎగుమతి చేసే అవకాశాలను సైతం ఎక్కువ చేసుకుంటున్నాము. రైల్వేల నిర్వాహకులు ముందు చూపుతో, దేశశ్రేయస్సు దృష్ట్యా పాటుబడటమే ఇందుకు కారణం.

1947లో మనకు స్వాతంత్ర్యం సిద్ధించే సమయానికి, మన రైల్వేలు బహు అధ్వాన్నస్థితిలో ఉన్నాయి. రెండవ ప్రపంచయుద్ధం మూలాన రైల్వేల ఆస్థిపాస్తులకు ఎంతో నష్టం వాటిల్లినది. దరిమిలా దేశ విభజన ఫలితంగా మన రైల్వే వ్యవస్థ మరింత దెబ్బతిన్నది. అయితే ఆ వెంటనే రైల్వేలవారు దీక్షగా పూనుకుని, ఎన్నాళ్లుగానో జరగవలసివున్న మరమ్మతులు జరిపించడానికి, పాడైపోయిన వాటి బదులు కొత్తవి సమకూర్చడానికి కాక, ఉత్తరోత్తరా అవసరమయ్యే సరకు సామగ్రిలను ఇక్కడ మన దేశంలోనే తయారు చేసుకునేందుకుకూడ సమగ్రమైన ప్రణాళికలను రూపొందించుకుని పనికి ఉపక్రమించారు.

ప్రణాళికాబద్ధంగా, దేశంలో ప్రగతి సాధనకు బాగా పెద్ద ఎత్తున 1950-51 నుంచి కృషి మొదలవడం మూలాన త్వరితగతిన ఆర్థికాభ్యున్నతిని సాధించడమూ, తత్ఫలితంగా ప్రయాణీకుల, సరకుల రాకపోకల రద్దీ విపరీతంగా పెరిగి పోగలవని రైల్వేల నిర్వాహకులు ముందుగానే గ్రహించారు. అభివృద్ధి సాధన స్థాయిని పెంపొందించడంలో తమకుగా తాము నిర్వర్తించవలసిన ప్రముఖ పాత్రను సైతం వారు విస్మరించ లేదు. మనకు అవసరమయ్యే సరకు సామగ్రులలో దాదాపుగా అన్నిటిని మన దేశంలోనే తయారు చేసుకునే స్తోమతును, అందుకు కావలసిన సాంకేతిక నిపుణులనూ సమకూర్చుకునేందుకూ, ప్రోత్సహించేందుకూ అనువయిన విధానాన్ని రూపొందించారు.

ఈనాడు మన రైల్వేలు ఆవిరితో నడచే ఇంజన్లు ప్రయాణీకుల పెట్టెలు, సరకులను వేసే వాగన్లు, రైలు పట్టాలవంటి సామగ్రి, సిగ్నలింగ్ పరికరాలు వంటి వాటి విషయంలో స్వయం సమృద్ధిని సాధించాయి. అంతేకాదు. ఈ యీ సరకు సామగ్రులను కొన్ని విదేశాలకు ఎగుమతి చేస్తున్నాముకూడా. ప్రత్యేకమయిన ఉక్కుతో తయారుచేసిన బహుకొద్ది సరకులను మాత్రమే ఇప్పటికి దిగుమతి చేసుకుంటున్నాము. అయితే ఈ లోటును సైతం త్వరత్వరగా తీర్చేందుకు కృషి జరుగుతూంది.

స్వయం సమృద్ధిని సాధించే సందర్భంలో ముందుగా దృష్టిని ఇంజన్లు, రైలు పెట్టెలు, వాగన్ల వైపు మళ్లించడము అయింది. బ్రాడ్ గేజ్ రైళ్లను లాగేందుకు అవసరమయిన ఆవిరి ఇంజన్లను తయారు చేయడానికిగాను చిత్తరంజన్ రైలింజన్ల కర్మాగారాన్ని 1950లో నెలకొల్పడం జరిగింది. క్రమేణా ఈ కర్మాగారం ఆసియా మొత్తం మీదనే ఖ్యాతి గడించింది. విద్యుచ్ఛక్తితో నడిచే ఇంజన్లు కూడా ఇప్పుడు అక్కడ తయారవుతున్నాయి. ఇప్పటికి, ఆవిరితో నడిచే ఇంజన్లు 2000, ఎలెక్ట్రిక్ ఇంజన్లు 101 ఈ కర్మాగారంలో తయారయినై.

రైళ్ల రాకపోకల రద్దీ అనాటి కానాడు పెరుగుతున్నది. ఈ పెరుగుతున్న అవసరాలు తీర్చడానికి గాను సాధ్యమయినంత హెచ్చుగా, రైళ్లను, డీసెల్ ఇంజన్లతోను, ఎలెక్ట్రిక్ ఇంజన్లతోను నడపాలని సంకల్పించారు. ఇందుకనుగుణంగానే, చిత్తరంజన్ కర్మాగారంలో ఆవిరితో నడిచే ఇంజన్ల తయారీని క్రమంగా తగ్గిస్తూ, 1970-71వ సంవత్సరం వచ్చే సరికి, ఎలక్ట్రిక్ ఇంజన్లు సాలీనా 150 దాకా తయారయ్యేట్టు చూడాలని నిర్ణయించారు. ఆ ప్రకారమే పని సాగుతూన్నది.

డీసెల్ రైలు ఇంజన్లు వారణాసిలోని కర్మాగారంలో తయారవుతున్నాయి. ఏర్పాటయింది 1963 లోనే అయినా ఆ కర్మాగారంలో ఇప్పటికప్పుడే ఒక వందపైచిలుకు ఇంజన్లు తయారయినాయి. ఈ ఇంజన్లలో ఉపయోగించిన భాగాలు చాలావరకు ఆ కర్మాగారంలో స్వయంగా తయారు చేసినవే. ఇక్కడ తయారయిన ఇంజన్లలో నూరవది ఈ సంవత్సరం జనవరిలో బయటికి వచ్చింది. దాని తయారీకి ఉపయోగించిన సామగ్రిలో 56 శాతం మన దేశంలో తయారయినదే.

ఇక, మీటర్ గేజ్ రైళ్లకు అవసరమయిన ఆవిరి ఇంజన్లు ప్రయివేటు రంగంలోని కర్మాగారాలలో తయారు అవుతున్నాయి. మూడవ ప్రణాళికా కాలంలో 320 ఇలాంటి ఇంజన్లను తయారు చేసి ఆయా కర్మాగారాల వారు, రైల్వేలకు అందచేశారు. రైల్వేల వారు బేరం ఇచ్చిన మరో 200 ఇంజన్లు తయారు అవుతున్నాయి. మీటర్ గేజ్, నేరో గేజ్ మార్గాలలో నడిచే డీసెల్ ఇంజన్లను, వారణాసి, చిత్తరంజన్ కర్మాగారాలలోని రైల్వే కార్ఖానా ఏదో ఒకదానిలో తయారు చేసేందుకు పూనుకోవాలని ఆలోచన. ఓడరేవుల లోనూ, ఉక్కు కర్మాగారాలు ఇంకా కొన్ని ఇతర పరిశ్రమలలోనూ ఉపయోగించే డీసెల్ ఇంజన్లను సైతం సమకూర్చేందుకు రైల్వేలవారిప్పుడు పూనుకున్నారు.

ప్రయాణీకుల పెట్టెలనూ, సరుకులు చేరవేసే వాగన్లనూ తయారు చేసుకోవడంలో మన రైల్వేలు సాధించిన ఫలితాలు మరీ గణనీయమైనవి. ప్రయాణీకుల పెట్టెలను, పెరంబూరులోని రైలు పెట్టెల ఫ్యాక్టరీలోనూ, బెంగుళూరులో ఉన్న భారత్ ఎర్త్ మూవర్స్ లిమిటెడ్ వాలాూకు రైలు పెట్టెల విభాగంలోనూ, కలకత్తాలో ఒకానొక ప్రయివేటు కంపెనీలోనూ తయారు చేస్తున్నారు. రైల్వేలకు సంబంధించిన కొన్ని కార్ఖానాలలో కూడా, కొన్ని రకాల పెట్టెలు తయారవుతున్నాయి.

పెరంబూరులోని కర్మాగారానికి 1955 లో ప్రారంభోత్సవం జరిగింది. ప్రపంచం మొత్తంమీద ఆ రకానికి చెందిన పెద్ద కర్మాగారాలలో ఒకటిగా తయారయింది. ఇక్కడ ఇంతవరకూ అయిదువేల పెట్టెలు తయారయినాయి. వాటిలో 3000 పైచిలుకు పెట్టెలకు, లోపల బల్లలు, దీపాలు, పంకాలువంటి హంగులన్నిటినీ అమర్చడమయింది. బ్రాడ్ గేజ్ మార్గాలలో నడిచే మూడవ తరగతి పెట్టె ఒకటి తయారు చేయడానికి 1956-57 లో 1,77,000 రూపాయలు ఖర్చయ్యేవి. అలాంటిది ఇప్పుడు, ఆ ఖర్చును 80,000 రూపాయలకు తగ్గించగలిగారిక్కడ. ఇప్పుడిప్పుడిక్కడ, ప్రయాణీకులతో పాటు సామాన్లు చేరవేసే రకం పెట్టెలనూ, బ్రేక్ వేన్లనూ, నిద్రపోయేందుకు ప్రత్యేక సదుపాయాలుగల పెట్టెలనూ, ఒకటి, మూడు తరగతులు రెండూ కలిపి ఉన్న పెట్టెలనూ, ఎయిర్ కండిషన్ చేసిన వాటినికూడా తయారు చేస్తున్నారు.

ఎలెక్ట్రిక్ రైళ్ళకు ఉపయోగించే 400 పైచిలుకు పెట్టెలను కూడా ఈ కర్మాగారంలో నిర్మించారు. మీటర్ గేజ్ డీసెల్ రైలుకార్లను నిర్మించేందుకు సైతం పూనుకున్నారు

సరుకులను చేరవేసే వాగన్లను, సాలీనా 40 వేలకు పైగా నిర్మించే స్తోమతను సంపాదించగలిగాము ఇప్పుడు. వాగన్ల తయారీని చాలావరకూ ప్రయివేటు రంగంలోని కర్మాగారాలే చూస్తున్నాయి.

రైల్వేలకు కావలసిన మామూలు రకం సిగ్నలింగ్ పరికరాలన్నీ ఇప్పుడు మన దేశంలోనే తయారవుతున్నాయి. విద్యుచ్ఛక్తి సహాయంతో పనిచేసే సిగ్నలింగ్ యంత్రాల విడిభాగాల తయారీకూడా అంతకంతకు పుంజుకుంటున్నది. అత్యాధునికమయిన ఈ ఎలక్ట్రికల్ సిగ్నలింగ్ పరికరాలను తయారు చేసేందుకు నెలకొల్పుతూన్న కేంద్ర కార్ఖానా త్వరలోనే ఉత్పత్తి ప్రారంభించగలదని భావిస్తున్నారు. నాల్గవ ప్రణాళికాకాలం ముగిసే సరికి, సిగ్నలింగ్ పరికరాలలో మరీ ముఖ్యమైన ఏకొన్నిటిని మాత్రమో దిగుమతి చేసుకునేందుకు అవకాశం ఏర్పడగలదని ఆశిస్తున్నారు. టెలీకమ్యూనికేషన్ సామాగ్రిని టెలిఫోన్ల కర్మాగారంలోనూ, భారత్ ఎలెక్ట్రానిక్స్‌లోనూ తయారు చేస్తున్నారు. ఇవన్నీ ప్రశంసార్హమైన ఫలితాలే. అయితే రైల్వేవారు ఇంతటితో తృప్తి చెందడంలేదు. ఇంకా గొప్ప లక్ష్యాలను సాధించ సంకల్పించారు. స్వయం సమృద్ధి సాధనకు నిర్విరామంగా పాటుబడుతున్నారు. ఇందుకుగాను వివిధ స్థాయిలలో ఎన్నో ఏర్పాట్లు చేశారు.

రైల్వేవారీవిధంగా స్వయం సమృద్ధిని సాధించేందుకు కృషి జరుపుతూ ఉండటం మూలాన, విదేశీ మారక ద్రవ్యాన్ని ఆదా చేసేందుకు వీలు కలుగుతున్నది. విదేశాల నుంచి సరుకు సామగ్రుల దిగుమతులు అంతకంతకు తగ్గిపోతున్నాయి. అవసరమయిన సరుకు సామగ్రులను ఇక్కడ దేశంలోనే తయారు చేసుకోవాలనే పట్టుదల మూలంగా, మన పరిశ్రమలకూ సాంకేతిక సిబ్బంది శక్తి సామర్థ్యాలకూ మంచి ప్రోత్సాహం లభించినట్లవుతున్నది. మన రైల్వేలకు కావలసిన సామగ్రిని ఇక్కడ దేశంలోనే తయారు చేసుకునే విషయంలో ఇంతవరకూ లభించిన ఫలితాలనుబట్టి చూడగా ఒక్క విషయం స్పష్టమయింది తగిన తర్ఫీదిచ్చి పని సాగించేందుకు అనువయిన పరిస్థితులను కనక కల్పించే పక్షంలో, మన దేశంలో పనివారు, సాంకేతిక సంబంధమైన నైపుణ్యంలోగానీ, ఉత్పాదక శక్తి స్తోమతులలోగానీ ప్రపంచంలో మరెవరికీ తీసిపోరు. పరిస్థితుల కనుగుణంగా సర్దుబాట్లు చేసుకుని కొత్తగా కొన్ని విధానాలనూ ప్రక్రియలనూ సృష్టించుకుని పని సానుకూల పడేట్టు చేయగల సామర్థ్యం భారతీయ కార్మికులకు ఉన్నది. ఈ శక్తి సామర్థ్యాలను ప్రజాసేవకోసం సద్వినియోగ పరిచేందుకు ఈ రైల్వేలు పూనుకున్నాయి.

*

సీరియల్ :

# ప్రతిఫలం

పిలకా గణపతిశాస్త్రి

## జరిగిన కథ

పార్థసారథికి నాటకాల పిచ్చి. రాఘవ నాట్యకళా మండలి ద్వారా నాటకాలు వేయిస్తుండేవాడు. నాటకాల రిహార్సల్సుతో పడి తరచు రాత్రిళ్ళు ఆలస్యంగా యింటికి వచ్చేవాడు. భార్యాభర్తల మధ్య ఈ విషయంలో పొరపొచ్చాలు వస్తుండేవి. ఒకసారి రాఘవనాట్యకళామండలిలో సభ్యుడు వెంకటనారాయణ అనే ఆయన వచ్చి రాఘవతో ప్రతిఫలం విషయంలో పార్థసారథి తనకు చేసున్న అన్యాయాన్ని గూర్చి చెప్పుకుని వాపోయాడు. ఆ విషయమేమిటో తెలుసుకుందామని రాఘవ సరోజ యింటికి బయలుదేరి వెళ్ళాడు

రాఘవ ఎవంత ఆలోచించినా అదే ధోరణితో సరోజ ఇంటి గుమ్మంముందు నిలబడి తొందరగా తలుపుతట్టి పిలిచాడు.

సరోజ అది విని వినగానే చరచరా కిందికి దిగివచ్చి అతన్ని చూడగానే ఎంతో ఉత్సాహపడి ఉప్పొంగుతున్న అభిమానంతో ఆహ్వానించింది.

"రండి ! రండి ! ఇప్పుడిప్పుడే మీకోసం కబురు పంపిద్దామని అనుకున్నాను. కాని సమయానికి ఇంట్లో ఎవ్వరు లేకపోవడం మూలాన్ని కుదరలేదు !"

రాఘవ ఆమెతోబాటు మేడమీది గదిలోకి వెళ్ళి కుర్చీలో చతికిలపడి రవంత బొమముడి విరిచి అడిగాడు.

"ఇంట్లో ఎవళ్ళు లేకపోవడమేమిటి ? ఎక్కడికి వెళ్ళారు ?"

"పనిమనిషి ఇంతకి మునుపే వెళ్ళిపోయింది ఆ తరవాత మా అమ్మ, చెల్లాయి సినిమాకి బయలుదేరారు."

"ఓహో ! అలాగా !...ఏదో అత్యవసరమయిన పని ఉంటే తప్ప నేను జ్ఞాపకం రానులే !...ఇంతకి ఏమిటా వ్యవహారం !"

'అదేమిటి అలాగ మాట్లాడతారు !...పెద్ద పని ఏమిలేదు! ఒక చిన్న సలహా అడగాలని ! అంతే !!"

'ఏమిటి చెప్మా ! ఆ సలహా !'

'అబ్బే ఏమిలేదు !'

సరోజ అతనికేసి రెప్పవాల్చకుండా చూసి, చిరునవ్వు చిందించి మాట్లాడకూరుకుంది. ఆనాడామె ముస్తాబయిన తీరు అతని కెంతో సరికొత్తగా మనోజ్ఞంగా సాక్షాత్కరించింది. తేనె రంగు గల చీరమీద లేత పసుపుపచ్చ రంగు సిల్కు జాకెట్టు సరోజ చామనఛాయ కొక వింత సోయగం కలిగించినదని అనుకున్నాడు. సిగలో తురుముకొన్న ఎర్ర చంద్రకాంతాలతో మేళవించిన గులాబీల సువాసనల గుబాళింపు లీలగా గాలిలో తేలి వచ్చి అతని హృదయాని కల్లలాచల్లని చక్కలిగింతలు పెట్టింది.

'ఏమిటలాగ ఆలోచిస్తున్నావు, అంతటి రహస్యమయితే నాతో చెప్పవద్దులే!'

'అబ్బే! అంత పెద్ద రహస్యమేమి కాదు, అయితే మీరీ మాట ఇంకెవ్వరితోను అనకూడదు...ఆఖరికి పార్థసారథిగారికి కూడా తెలియనీయకూడదు.?'

ఆ ధోరణి అతని కెంతయినా ఆశ్చర్యం కలిగించింది. 'అంతటి ఆత్మీయత ఏర్పడిన పార్థసారథికి కూడా తెలియకూడని అపరమ రహస్యం ఏమయి ఉంటుందా?' అని క్షణకాలం విస్తుపోయాడు. అటువంటి అమూల్య రహస్యం చెవిని వేస్తున్న ఆమె యెడల అతనికి కొంత సామరస్యంకూడా కలిగింది.

'అలాగేలే! నువ్వు అంతరహస్యం అన్నప్పుడు నేనెందుకు చెబుతాను! సరేగాని, అంతటి రహస్యం విని దానికి తగిన చక్కని సలహా ఇచ్చినందుకు నా కేమి బహుమతి ఇస్తావు.?'

సరిపోయింది! మీ కంతా వేళాకోళమే!...కాస్త నేనుచెప్పే సంగతి శ్రద్ధగా వినండి!'

సరోజ కనురెప్పలల్లన వాల్చి, శిరస్సు కొంచెంవంచి బ్రతిమాలుకుంటున్న ధోరణిలో అడిగింది.

'అలాగే వింటాను గాని ముందుగా బహుమతి సంగతి నిక్కచ్చిగా తేల్చిచెప్పు! లేకపోతే మరి నీ గొడవ నాకక్కరలేదు!'

'అలాగే ఇస్తానుగాని కొంచెంసేపు వేళాకోళం కట్టి పెట్టండి!'

'ఏమిటిస్తావు బహుమతీ!'

'మీరేది కోరినా సరే! సరేనా?'

'నిజమేనా? మాట తప్పకూడదు సుమా?...మరి కానీ!'

'సరోజ చిరునవ్వు చిలకరిస్తున్న ఏకాగ్రదృష్టితో అతనిని పరిశీలిస్తూ గొంతు తగ్గించి తనరహస్యం బయటపెట్టింది.

'అబ్బే! ఏమిలేదు ఈ మధ్యన నాకొక సినీమా ఛాన్సు వచ్చింది.'

'ఓహో! అలాగా! ఎక్కడినించి? ఎవరి దగ్గరినించి?'

'మెడ్రాస్‌నించి ఒకాయన ద్వారావచ్చింది.'

'ఇంతకి అప్రొడ్యూసరెవరు? డైరెక్టరెవరు? ఆకంపెనీ పేరేమిటి?'

'ఆవివరాలేవి ఇంకా తెలియలేదు. కాని అది చాలామంచి కంపెనీ అని తెలిసింది.'

'హీరోయిన్ వేషమా? లేకపోతేఏదోసామాన్య వేషమా?'

'హీరోయిన్‌వేషంకాదు గాని ఇంచుమించుగా అలాంటిదే అనుకుంటాను'

'అయితే ఇంతకి ఏమాత్రం ముట్టజెపుతారు!'

'ఏదీ ఇంకా ఏదీనిచ్చితంగా తేలలేదు. ఎంత అడిగితే బాగుంటుంది? మరి ఇక్కడ ఇవన్ని విడిచిపెట్టి మెడ్రాస్ వెళ్లడం మంచిదా ? కాదా ? నాకేమి పాలు పోవడంలేదు. ఇందుకనే మిమ్మల్ని అడగాలని అనుకున్నాను.'

'అయితే మరి మన నాటకాటోలమా?'

'ఏం వీటికి సినీమా అడ్డేముంది? కొంత కాలందాకా నాటకాల్లో వేషాలు వేస్తూ సినిమాల్లో నటించకూడదా?'

'ఎందుకు నటించకూడదు? అయితే నాటకాలకి, సినీమాకి లంగరందాలి మరి!...సరే దీనికేంగాని ఇంతకి నీకీ సంగతులన్ని చెప్పిన మధ్యవర్తి ఎవరు?'

రాఘవతొంగిచూస్తున్న జిజ్ఞాసతో ప్రశ్నించాడు.

'ఆయన ఇవన్ని కొంతకాలందాకా అతిరహస్యంగా దాచమన్నారు మీకవన్ని ఆతరువాత చెబుతానుగా! ఏమండీ మనం పదిహేను వేల దాకా అడగవచ్చునా? ఎంత అడగాలో నాకేమి తెలియడం లేదండీ!'

సరోజ అసలు సంగతులేవి బయట పెట్టకుండా గుంబనగా దాచివేస్తున్నదని రాఘవ పసికట్టడానికి ఎంతోసేపు పట్టలేదు. అందుచేత అతనికి ఆమె మీద ఎంతయినా చిరాకు కలిగింది. అయినా అది రవంత అయినా పైకిపొక్కకుండా ముభావంగా అన్నాడు:—

"పదిహేను వేలేమిటి? ఇంకా ఎక్కువే అడగవచ్చును, మరి ఆ ప్రొడ్యూసరెవరో, డైరక్టరెవరో, ఆ కంపెనీ ఎలాంటిదో తిన్నగా తెలియందే ఎలాగ చెప్పడం? చెరువులో గేదెనట్టే బెట్టి కొమ్ములు చూపించి బేరమాడినట్టుంది నీ వ్యవహారం!''

రాఘవ ప్రశ్నలో విసుగు, చిరాకు పసికట్టిన సరోజ అతన్ని అన్యోన్యత తొణికిసలాడుతున్న స్నిగ్ధస్వరంతో నెమ్మదిగా బ్రతిమాలుతుంది.

'అదేమిటంటే! అలాగమాట్లాడతారు! నాకుపూర్తిగా తెలిస్తే మీకుచెప్పకుండా దాచివేస్తానా? మీదగ్గర నాకుదాపరికం ఏమిటిచెప్పండి!.......... అన్నట్టు వాళ్లు మీసంగతి కూడా అడిగారట! ముందుముందు మిమ్మల్ని కూడా తీసుకుంటారులా ఉంది'?

'నిజమేనా?

రాఘవ రవంత అనుమానపడి అడిగాడు.

'నిజమే! మీతో అబద్ధం చెబుతానా?'

'అబద్ధంచెబుతావని కాదు! ఊరికే వేళాకోళానికన్నా వేమో అని అనుకున్నాను.'

'ఇలాంటి వ్యవహారంలో మీతో వేళాకోళం ఆడుతానా? అదేమిటండీ! అలాగంటారు!'

'అయితే వాళ్లు పార్థసారథి మాట ఎత్తలేదా?'

'ఎందుచేతనో ఆయన మాటే తలపెట్టలేదట!'

అసహాదాసం విన్నతరువాత రాఘవకెంతో సంతోషం కలిగింది. రవంత సేపాలోచించి రెట్టించిన ఉత్సాహంతో ప్రోత్సహించాడు.

'సరే మామాటకేంగాని ముందు నీసంగతి తేలనీ! ఆపైన నాదాకావస్తే అప్పటిమాట ఆలోచించ వచ్చునులే! ఆకంపెనీ అంతమంచిదయితే, మొట్టమొదటిసారి కనక కొంత తక్కువ ముట్టజెప్పినాసరే, మాట్లాడకుండా ఒప్పుకో! ఈ పిక్చర్‌లో కొంత మంచిపేరు సంపాదించుకుంటే, ఆతరువాత గట్టిగా బిగించవచ్చును. అప్పుడు ఈనాటకాల గొడవలన్ని విడిచి పెట్టినా విడిచిపెట్టవచ్చును. అయితే సినిమాల్లో బాగా కాలునిలవ దొక్కుకునేదాకా మాత్రంఇవి విడిచిపెట్టడం మంచిదికాదు! ఏం నేనుచెప్పిన సలహానచ్చిందా'?

'అవును మీరుచెప్పింది మంచిసలహాయే! నాకు ఇంచుమించుగా ఇలాగేతోచింది గానిధైర్యం చాలలేదు. అందుచేతే ఒకసారి మీతో ఆలోచించాలని అనుకున్నాను.'

'అయితే మరినేను వెళ్లనా?'

రాఘవ లేవబోయాడు 'వెళ్లండి! బాగా చీకటిపడ్డట్టుంది! పాపంమీవాళ్లు కాచిపెట్టుకుంటారేమో!'

అంతలోనె రాఘవ దీపకాంతిలో తళతళ లాడుతున్న ఆమె చెక్కిళ్లపై లోలక్కులకేసి క్షణకాలం నిశ్చలంగాచూసి మంద్రమధురస్వరంతో అర్థించాడు.

'అన్నట్టు నాబహుమతి మాట! ' రాఘవ కొంటెగాకన్నుగీటి అడిగాడు.

'ఏం మాట్లాడవేం?'

'అప్పుడేమరిచి పోయావా? మంచి సలహా చెబితే నేను ఏ బహుమతి అడిగినా ఇస్తానన్నావుగా! ఇంతలోనే అంత మతిమరుపా!'

రాఘవ నెమ్మదిగా కుర్చీలోనించి లేచి చిరునవ్వులు చిలకరిస్తూ చేతులు చాచి కౌగలించుకోబోయాడు. అంతలోనే సరోజ తటాలున కుర్చీలోనించి లేచి దూరదూరంగా తొలిగిపోయి నిలువునా నిర్ఘాంత పడింది! ఆమె వైఖరి అతని కింతకన్న ఆశ్చర్యం కలిగించింది! అయినా అభావం చూచాయగానయినా వ్యక్తంకానీయక హేళనగా నవ్వుతూ ప్రశ్నించాడు.

'అదేమిటి సరోజా! అలాగ కంగారు పడిపోతున్నావు! ఇంతకీ నేచేసిన తప్పేమిటి?... అన్నమాట చెల్లించుకోమనేగా అడిగాను!... ఏమిచిత్రం! ఇంతలోనే పరాయి వాణ్ణయిపోయానా? అవునులే! ముందువచ్చిన చెవులకన్న వెనకవచ్చిన కొమ్ము లేవాడి!

సరోజ ఇంకా అతని వైపలాగే నిశ్చలంగా చూస్తూ విస్తుపోయింది రాఘవ ఆమె నలాగా సూటిగా ఎత్తిపొడవడానికొక కారణంవుంది. మొట్టమొదట సరోజా పార్థసారథులకిద్దరికీ ఒకరొకరితో పరిచయం కలిగించినవాడు రాఘవే! అయితే అంతకు మునుపే సరోజా రాఘవలమధ్య కొంత దోస్తీ కలిసింది కాని క్రమక్రమంగా అదిబాగా పాతబడిపోయింది.

రాఘవ మళ్లీ అలాగే నవ్వుతూ ఎత్తిపొడిచాడు.

'ఏం అంతేనా? మాట్లాడవేం?'

సరోజ శిరస్సుకొంచెం వంచి చిక్కగా ఎర్రబడిన చెక్కిళ్లతో మరింతగా మనోజ్ఞమయిన ముఖభంగిమతో క్రీగంటిచూపు ప్రసరింపజేసి మృదువుగా బ్రతిమాలుకుంది.

'కొంచెం నామాటవినండి! ఇలాగంటున్నానని ఏమి అనుకోకండి! ఆ వెనకటి రోజుల్లో అయిందేదో అయిపోయింది! ఇక ఆమాటతలపెట్టకండి! అల్లరి చిల్లరిదాన్నని నలుగురి నోళ్లలోను పడడం నాకిష్టంలేదు! పార్థసారథిగారికిగాని ఈగొడవతెలిస్తే బొత్తిగా బాగుండదు! పైగా దీని మూలాన్ని మననాటకాల వ్యవహారంకూడా మొదటికి వస్తుంది!... నామాటవినండి!.'

సరోజ ఇంకాదూరంగా వెళ్లి ఆగదిలో కుర్చీ వెనకాల మూలకానుకుని నిలబడింది ఆమెఅలాగతిరస్కరిస్తున్నకొద్ది అతని పట్టుదలమరింతగా గట్టిపడిపేరుకుంది. పైగా ఆ తిరస్కృతి అతని అహంభావానికికొక దారుణమయిన ఆఘాతంగా పరిణమించింది। మరి భరించ లేక ఆమె దగ్గిరికి వెళ్ళి తిరిగి బ్రతిమాలుకున్నాడు.

"ఇంట్లో ఎవళ్ళూ లేరుగా! మరేం భయం లేదులే! నేనీ మాట పైకి పొక్కనివ్వనులే! ఇక పైవాళ్లకెలాగ తెలుస్తుంది?"

సరోజ అతని పట్టుదల గమనించి తటాలున తప్పించుకొని ఇంకొక మూల నిలబడింది! అయితే పైపైకి ఆమె పార్థసారథి మీద వల్లమాలిన అభిమానము ఆత్మీయత ఒలకబోస్తున్నా లోలోపల మాత్రం మద్రాసు వెళ్ళి పోవాలని పన్నాగాలు పన్నుతున్నదని, అదంతా వట్టిమాటనే అని గ్రహించడానికి రాఘవకెంతో సేపు పట్టలేదు. కాని ఆమె ధోరణిని బట్టి ఒక వేళ తన ఊహ నిజం కాదేమోనని క్షణ కాలం తటపటాయించాడు. కాని మరు నిముషంలోనే సాహసించి ఆమెనక్కున చేర్చుకుని చెక్కిలి ముద్దు పెట్టుకోబోయాడు. అంతలోనే ఆమె అతని కౌగిలి పట్టు విడిపించుకోవాలని శాయశక్తులా ప్రయత్నించి ధుమ ధుమలాడుతూ రుసరుస లారంభించింది.

'అబ్బా! ఏమిటీ మోటు సరసం! మా అమ్మ. చెల్లాయి సినిమానుంచి వచ్చే వేళయింది! విడిచి పెట్టండి!'

అయినా అత డామె మాట లక్ష్యపెట్టలేదు. మరింత గాఢంగా కౌగలించుకున్నాడు.

'ఇంకా తొమ్మిదయినా కాలేదు! అప్పుడే రారులే! మరేం కంగారు లేదులే!'

కాని ఆమె తన పెనుగులాట విరమించలేదు.

'సినిమాగాని బాగుండకపోతే మధ్యలోనే బయలుదేరి వచ్చేస్తారు. అదిగో వీధి తలుపు తట్టిన చప్పుడు వినిపిస్తుంది. ఒక వేళ వచ్చారేమో! చూసి వస్తాను! నన్ను వెళ్ళనివ్వండి! విడిచి పెట్టండి!"

కాని రాఘవ తన బిగి కౌగలి రవంతయినా సడలించలేదు.

'ఏదీ నాకెక్కడా ఆ చప్పుడు వినబడడం లేదే! అమ్మ దొంగా ఊరికే తమాషాకని అన్నావు! అవునా!'

సరోజ యిక తన పెనుగులాట విరమించి అవునని అంగీకరించక తప్ప లేదు! నెమ్మదిగా అతని రొమ్ము మీద చెక్కిలి చేర్చి మరింతగా ప్రాధేయపడుతున్నట్టు ముఖం పెట్టింది.

అవును వేళాకోళానికని అన్నాను. అంతే.

"అలాగ దారికిరా!"

రాఘవ చిరునవ్వు పువ్వులతో చెక్కిలిమీద చిటికెవేసి కుర్చీలో కూర్చుని ఏకాగ్రదృష్టితో సరోజ ముఖం పరిశీలించాడు.

నువ్వు ఎంతటి దానివి! ఇన్నాళ్లనించి ఏమో అనుకున్నాను. నటనలో మేమిద్దరముకూడా నీదగ్గర తీసికట్టే!' సరోజ తిరిగి నెమ్మదిగా తన కుర్చీలో కూర్చుని చెరిగిన ముంగురులు సవరించుకుంటూ బుంగమూతి పెట్టి గట్టిగా కసురుకుంది.

'చాలు! చాలు లెండి! నేర్చుకున్నారు మాటలు! ఇదంతా మీరు నేర్పిన విద్యే'

'కనకనే గురుదక్షిణ పూర్తిగా రాబట్టుకోవాలని తాపత్రయ పడుతున్నాను!'

ఆ ఛలోక్తితో సరోజ ముఖం కుంకుమ రక్తిమతో తళతళ లాడింది. అదే క్షణంలో రాఘవ తిరిగి అందుకున్నాడు.

'అవునుగాని సరోజా! నిన్నొకమాట అడుగుతాను గాని ఏమి అనుకోవు గదా!

'ఇంత మీదగ్గర అనుకోడానికేం మిగిలింది ! దానికేం ? అడగండి !'

'పార్థసారథి ఈ మధ్యన మనవాళ్ళలో కొందరికి ఎక్కువ డబ్బు ముట్టజెప్పి, పాపం వెంకటనారాయణ కొంచెం ఎక్కువ ఇమ్మని అడిగితే కసిరికొట్టివేశాట్ట ! నువ్వుకూడా పూర్వంకన్న మూడింతలు ఎక్కువ పుచ్చుకుంటున్నావుట ! నిజమేనా ?'

'ఎవరు చెప్పారు మీకీ మాటలు ?'

'ఒకరు చెప్పాలేమిటి ? నేనామాత్రం గ్రహించుకోలేనా ?'

ఆ సమాధానం విని సరోజ కొంతసేపు ఆశ్చర్యపడింది. ఆ తరువాత ఆ వ్యవహారంలో జరిగిన సంగతులన్నీ సంగ్రహంగా అతనికి వివరించింది. చిట్టెమ్మకి, వెంకయ్యకి, ఇంకొక ఇద్దరికి పార్థసారథి కొంచెం ఎక్కువ సొమ్ము ఇచ్చిన మాట నిజమేనని అంగీకరించింది. అయితే వాళ్లేవేవో ఇబ్బందుల్లో చిక్కుకున్నామని మాటిమాటికి ప్రాధేయ పడినందువల్లనే పార్థసారథికి మరికొంత సొమ్ము ముట్టజెప్పక తప్పలేదని నెమ్మదిగా నచ్చజెప్పింది. కాని తాను మూడురెట్లు ఎక్కువ తీసుకుంటున్న సంగతి పట్టి పచ్చి అబద్ధమని కొట్టిపారేసింది ఏదో అత్యవసరం మీద కొంత అప్పుగా తీసుకున్న మాట మాత్రం నిజమేనని నీళ్ళు నమిలింది. అయితే రాఘవకామె మాటలమీద అంతగా నమ్మకం కలగలేదు. కొంచెం వెటకారంగా నవ్వుతూ అడిగాడు.

'నిజమేనా ?'

'నిజమే! మీకు నా మాటమీద నమ్మకం కలగకపోతే మరి నేనేమి చేసేది ?'

కాని రాఘవ మనస్సులో అనుమానం మాత్రం వేధించడం మానలేదు. అయినా ఆ సంగతితప్పించి వెంకటనారాయణ వ్యవహారం ప్రస్తావించాడు.

'సరేలే! దీనికేంగాని, పాపం వెంకటనారాయణ అంత నోరు విడిచి అడిగినప్పుడు కాస్త చేత్తో రాదంటే ఏంపోయింది?'

'ఏదో కొంచెం ముట్టజెబుతామనే అన్నారట! కాని ఆయన ఇంకా ఎక్కువ కావాలని భీష్మించుకుని కూర్చున్నారట!'

'అలాగా! నాకీసంగతి తెలియనేలేదే!'

దానిమీద సరోజ కొంచెం దురుసుగా సమాధానం చెప్పింది.

'ఎలాగ తెలుస్తుంది? ఆ వెంకటనారాయణగారే మీకీ లేనిపోని గొడవలన్నీ కల్పించి చెప్పినట్టున్నారు ! అలాంటప్పుడు ఆయన తనలోటు బయటపెట్టుకుంటాడా?'

ఆ వ్యవహారంలో పార్థసారథి తన మాటే తలపెట్టలేదని రాఘవ మనస్సులో అట్టుడికినట్టుడికి పోతున్నాడు ! కాని ఆ మాటే ఎత్తుకోవడం మానివేసి తిరిగి వెంకటనారాయణనే సమర్థించాడు.

'పోనీ, అతగాడు కొంత ఎక్కువే అడిగాడనుకో! మిగిలిన వాళ్ళలాగే అతనికికూడా సంతోషపెడితే ఏంపోయింది?'

సరోజ గొంతులో చిరాకు చిటపటలాడింది.

'సంతోష పెట్టడం అంటే మాటలా! మీకేం? మీరిలాగే మాట్లాడతారు ! మధ్యన మీ సొమ్మేం పోయింది ? ఆయన ఈ మధ్యన మన నాటకాల ఖర్చులకని మూడెకరాల భూమి తణఖా పెట్టారు! ఇవ్వన్నీ ఎవరికి కావాలి?'

'ఇదేమిటి? ఈ వేళ పార్థసారథినిలాగ వెనక వేసుకువస్తున్నావు! ఒకవేళ నీకుకూడా లాభాల్లో వాటా ఉందేమిటి?'

రాఘవ వెటకారంగా నవ్వుతూ అడిగాడు.

'అమాత్రం తెలివితేటలుంటే నేనీపాటికి సినిమా స్టార్‌నే అయి ఉందును!'

సరోజ మరింతగా రుస రుస లాడుతూ ముఖం వేరొక పక్కకి తిప్పివేసుకుంది.

రాఘవ ఆ వైఖరి గమనించి క్రమ క్రమంగా గొంతు స్థాయి హెచ్చిస్తూ కసురుతున్నాడు.

'సరేలే! దీనికేంలేగాని, ఇన్నాళ్ళనించి అతనుగాని నువ్వుగాని నాకొక చిన్న బహుమతి అయినా యివ్వాలని అనుకున్నారా? ఇంతకు మునుపెన్నడయినా నేను మీదగ్గర సొమ్ము మాట తలపెట్టానా ? అవును ! ఇంత మెత్తగా ఉండబట్టి మీరిద్దరు ఏకమై నన్ను బొత్తిగా ఎందుకు పనికిరాని వాడికింద జమకట్టివేశారు! పోనీ, అతడుగాని, నువ్వుగాని, మాటవరుసకయినా మిగిలిన వాళ్ళకింత ఇస్తున్నామని నాతో చెప్పారా ? చెబితే నాకుకూడా ఇమ్మని అడుగుతాననేగా మీభయం ? లేకపోతే ఈ వ్యవహారం మీరిద్దరు ఇంత గుంభనగా దాచివెయ్యవలసినంత అవసరం ఏమివచ్చింది? మీకిద్దరికి ఇంత పైవాణ్ణి అయినప్పుడు నేనింక ఈ మండలిలో ఎందుకుండాలి ? నాకేమన్నా గతిగాని కడుక్కుపోయిందా ? సరే, ఇక నాదారి నేను చూసుకుంటానులే!'

పోనుపోను రాఘవ గొంతులో అక్కసు కస్సుమని బుసకొట్టింది. వెనువెంటనే అతడక్కడినించి వెళ్ళిపోయే ఉద్దేశంతో తటాలున లేచినిలుచున్నాడు. మరుక్షణంలోనే ఆ అభిప్రాయం గమనించిన సరోజ త్వరగా అతనిదగ్గరికి వెళ్ళి చేతులు రెండు పట్టుకుని బ్రతిమాలుకుంది.

'వెళ్ళిపోకండి ! నేను చెప్పేమాట కాస్త వినండి ! మేమెన్నడు మిమ్మల్ని మోసగించాలని అనుకోలేదు! కాస్త మన మండలి రాబడి పెరిగిన తరవాత మీకు అందరికన్న ఎక్కువగానే ఇవ్వాలని అనుకున్నాము. సరే, ఆ సంగతి ఇప్పటినించి చెప్పడమెందుకని మాట్లాడ కూరుకున్నాము. అంతేగాని, ఆయనగాని,

నేనుగాని మీకు చేసిన అన్యాయమేమిలేదు! అనవసరంగా మామీద అపోహ పడకండి! నామాట నమ్మండి!'

ఆ విధంగా ప్రాధేయపడిన తరవాత అంతకుమునుపు ఆమెమీద అతనికేర్పడిన కోపం కొంతవరకు శాంతించింది కాని సరోజ మాటల్లో ఉన్న నిజంఎంతో తిన్నగా తెలియలేదు! అయినా పైపైకి బాగా సంతృప్తిపడ్డట్టే నటించి ఆమెనక్కున జేర్చుకుని ముంగురులు సవరిస్తూ మృదువుగా ముద్దుపెట్టుకున్నాడు.

'నిన్నుగాని, అతన్నిగాని నేను అనుమానించలేదు సరోజా! పోనీ ఈ వ్యవహారం కొంచం ముందుగా నాచెవినివేస్తే ఏం పోయిందని అనుకున్నాను. అంతే! పోనీ, ఆ వెంకటనారాయణకి ప్రస్తుతానికి నేనే ఏదోకొంచం ముట్టజెప్పి నెమ్మదిగా బుజ్జగిస్తాను! ఆ తరవాత అతనికేదో ఏర్పాటు చెయ్యవచ్చును! దానికేంలే!... సరే దీనిమాటకేంగాని ఆ కంపెనీ పేరేమిటి? ఆ మధ్యవర్తి ఎవరు? అంతటి రహస్యం అయితేమాత్రం చెప్పవద్దు! ఊరికే కొంచెం తెలుసుకోవాలని అడిగాను! అంతే!'

రాఘవ ఉట్టి పడుతున్న అన్యోన్యతతో జిజ్ఞాసతో సరోజ వైపు చూశాడు. ఆమె చిరునవ్వులు విరజిమ్ముతున్న చూపులతో తిరిగి అవలోకగా అతని గుండెమీద వాలి అనునయ ధోరణితో తియ్య తియ్యని మాటలతో సమాధానం చెప్పింది.

'నిజంగానే నా కాసంగతులేవి తిన్నగా తెలియవు! పైగా ఆ పెద్దమనిషి ఈ వ్యవహారం అంతా పూర్తిగా తేలేదాకా అతి రహస్యంగా ఉంచమని మరీ మరీ చెప్పారు! కొద్ది రోజులలో అన్నీ బయట పడతాయిగా! అప్పుడు మీకు చెప్పకుండా ఇంకెవ్వరికి చెబుతాను! ఇందుకనేగా ఈ సంగతి మొట్టమొదటగా మీతో ఆలోచించాను! మీరుకూడా ఆ సినీమాలో చేరుదురుగాని! ఆ కంపెనీవాళ్ళు మీ సంగతికూడా ఆలోచిస్తున్నారట! కొంచెం నామాట నమ్మండి! అనవసరంగా అపోహపడకండి!'

ఆ సినీమా వ్యవహారం సరోజ వేలు విడిచిన మేనమామ వెంకటకృష్ణయ్య ఆమెపేర వ్రాసిన ఒక కవరులో సంగ్రహంగా, చూచాయగా ప్రస్తావించాడు. తిరిగి అడిగిన తరవాత సరోజ రాఘవకి ఆ సంగతి కాస్తా బయటపెట్టాలనే అనుకుంది. మాట నోటి చివరిదాకా వచ్చింది. కాని అంతలోనే ఆ అభిప్రాయం మార్చుకుని అమాయకమయిన నిశ్చల దృష్టితో అతని ముఖ కవళిక పరిశీలించింది. ఆ సమాధానంవిన్న తరవాత రాఘవ చాలావరకు సంతృప్తిపడ్డాడు.

'పోనీ, అన్నీ తెలిసిన తరవాతే చెబుదువుగానిలే! దాని కేం! ఆ కంపెనీ మంచిదవునో కాదో అని అడిగాను! అంతే! అన్నట్టు మీవాళ్ళు తిరిగివచ్చే వేళయినట్టుంది! మరినేను వెళ్ళనా?'

'అవును! మాటల్లోపడి మరిచిపోయాను! మావాళ్ళు తిరిగి వచ్చేవేళయింది! మరి మీరు వెళ్ళండి! ఇదిగో! ఒక్కమాట! ఈ సినీమా సంగతిమాత్రం మరి రెండోకంటి వాడికెవడికి తెలియనీయకండేం? పార్థసారథిగారికసలే తెలియనీయవద్దు! తెలిసిందా?'

'అలాగే! నువ్వు ఇంత రహస్యంగా ఉంచమన్నప్పుడు నేనెందుకు చెబుతాను! నేనసలు మాటలుకూడా అతనితో చెప్పకేం?'

'అలాగే!' అని అంగీకరించిన తరవాత రాఘవ ఇంకొక సారి ఆమెనక్కున జేర్చుకుని చెక్కిలి ముద్దుపెట్టుకుని అక్కడి నించి బయలుదేరాడు. అట్టే శషభిషలేవి లేకుండా తిరిగి ఆమె ఆవిధంగా తనకెంతో సన్నిహితురాలయినదని రాఘవ ఎంతయినా ఉప్పొంగిపోయాడు! కాని ఆ మధ్యవర్తి పేరయినా చెప్పకుండా గుంభనగా దాచివెయ్యడం మాత్రం అతనికంతగా సంతృప్తి కలిగించలేదు. కాని ఆనాటి అపూర్వ సంఘటనతో పార్థసారథి మీద అతనికేర్పడిన ఈర్ష్య, అసూయ, ఆగ్రహము కొంతవరకు శాంతించాయి. (సశేషం)

## ఫోటోలు పంపించండి

ఆంధ్రప్రదేశ్ పత్రికలో ప్రకటనార్హం కళాత్మకంగా ఉండే ఫోటోలు పంపించండి. మీరు పంపే ఫోటోలు మీరే స్వంతంగా తీసినవై వుండాలి. ఫోటోపేరు, మీ చిరునామా విసరంగా ఫోటో వెనక వ్రాయాలి. ప్రచురింపబడిన ఫోటోకు తగిన విధంగా పారితోషికంయివ్వబడును. ఫోటోలు శ్రీ ఎన్.వి. గోపాలశాస్త్రి, సంపాదకుడు, (ఇంగ్లీషు) ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక, సమాచార పౌరసంబంధశాఖ, హైదరాబాదు, చిరునామాకు పంపించండి. తగినన్ని స్టాంపులు జతపరచినప్పుడే ఫోటోలు త్రిప్పి పంపించడం జరుగుతుంది.

# పంచతంత్రము

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

పూర్వవిరోధినిగాని, మిత్రత్వము చేయుచున్న శత్రువును గాని నమ్మగూడదు. ఎట్లనగా :—

దక్షిణ దేశమునందు 'మహిళారోప్యము.' అను పట్టణము కలదు. దాని సమీపమునందు అనేక శాఖలతోను, దట్టముగా నిండిన ఆకులతోను, శోభించుచున్న మఱ్ఱిచెట్టు కలదు. ఆ వృక్షము నందు 'మేఘవర్ణుడు' అనువాయసరాజు సపరివారముగా నుండెను అతడు తన సంరక్షణమునకు తగిన వ్యవస్థచేసి కొనును పరిజనముతోపాటు కాలమును గడుపుచుండెను. ఆ సమీపమునందే పర్వత గుహలను ఆశ్రయించుకొని 'అరిమర్ధనుడు' అను ఉలూక రాజు ఉండెను ఆ గుడ్లగూబ తన పరివారముతో ప్రతిదినము రాత్రి కాకులు ఉన్న వట వృక్షము చుట్టు తిరుగు చుండును. తనకు దగ్గరగా వచ్చిన కాకిని చంపిపోవు చుండును. ఈ విధముగా ప్రతి దినము వాయసములను చంపుచు కొన్ని నాళ్లలోనే ఆ వృక్షమునందు కాకులు లేకుండ చేసెను. శత్రువునుగాని, రోగమునుగాని నిర్లక్ష్యము చేసిన యెడల ఇట్లేయగునుగదా!

ఇట్లుండగా నొకనాడు వాయసరాజు తన మంత్రులను పిలిచి యిట్లనెను:—

"ఓయీ! మనకు ప్రబల శత్రువు దాపరించి మన జాతి సంతతిని నశింపజేయు చున్నదే. దానికి ప్రతిక్రియ మనమేమి చేయుదుము? మనకు రాత్రి కన్నులు కానరావు. పగలు గుడ్లగూబ గుహను కనిపెట్ట లేక పోవుచున్నాము. కనుక ఉలూకములను హతమార్చుటకు ఉపాయమేదియు గోచరించుటలేదు. కనుక ఇప్పుడు మనము అవలంబించ వలసిన ఉపాయమును మీరు విచారించి త్వరగా చెప్పుడు" ఆమాటకు మంత్రులిట్లు బదులు చెప్పిరి:—

ఉజ్జీవి:— బలవంతునితోపాటు విరోధము చేయగూడదు వానితో సంధి చేసుకొనవలెను.

సంజీవి:— శత్రువుతో సంధి చేసికొనుటకు నేను అంగీకరించను. ఇంతయేకాక, గుడ్లగూబ అతిక్రూరుడు, మిక్కిలి లుబ్ధుడు, అధర్మపరుడు. అందుచేత గూడ అతనితో సంధి చేయగూడదు. అతనితో మనము యుద్ధమునే చేయవలెనని నా మతము.

అనుజీవి:— దేవా! మన శత్రువు బలవంతుడు, మర్యాదలేని వాడు. అందుచేత అతనితో సంధిగాని, విరోధము గాని చేయ గూడదు. యానము చేయవలెను. అనగా శత్రువు బలాబలములను కనిపెట్టి వానికి తగ్గినట్లుగా నుండి సమయము కనిపెట్టి శత్రువుపై దాడి సలుపుట యానమనబడును.

ప్రజీవి:— సంధి, విగ్రహ, యానములు మూడును సరియైనవి కావు. ఇప్పుడు మనము 'ఆసనము' అను నుపాయమునే అవలంబించ వలెను మనచోటనే మనము ఆసనమువేసుకొని స్థిరముగా కూర్చొనవలెను. మన స్థానమునకు ఎంతగొప్ప శత్రువువచ్చినను నక్కను గజమును నీటిలోనికి ఈడ్చినట్లు శత్రువులులాగ వచ్చును.

చిరంజీవి:— ఇప్పుడు మనము అవలంబించవలసినది 'సంశయము.' కనుక మంచిసమర్థుని మనమిప్పుడు ఆశ్రయించవలసియున్నది. సహాయము లేకున్నచో వాయు సహాయము లేక అగ్నిజ్వలించినట్లు మన ప్రతాపము పనికిరాదు. కనుక మనకు సత్సాంగత్యము అవసరము. అది యెంతచిన్నదైనను వరిపైరు మొలచుటకు బియ్యపుగింజను పండించుటకు యెంత అవసరమో అదికూడ అంత అవసరము. ఈ విధముగా నలుగురుమంత్రులు తమతమకు తోచిన సలహాలను చెప్పగా మేఘవర్ణుడు, తనతండ్రికి మంత్రియైన 'స్థిరజీవి' యను వృద్ధునిఅడిగెను.

స్థిరజీవి:— అందరును తమతమకు తోచిననీతిని 'సంధి, విగ్రహ, యాన, ఆసనములు,' అనుఉపాయములను సూచించిరి. కాని యిప్పుడుమనకు 'ద్వైధీభావమే' అనుసరింపదగిన ఉపాయము. అనగా అనుమానముతోనుండుట. శత్రువును విశ్వసింపజేసి అతని ఛిద్రములనుకనిపెట్టి మట్టుబెట్టుటకు యోచించుచుండవలెను.

మేఘ:— శత్రువు విషయమే మనకు తెలియదే. అతని ఛిద్రము లెట్లు కనిపెట్టగలము.

స్థిర:— శత్రువుస్థానమును, అతని ఛిద్రములను చారులద్వారా సులభముగా కనిపెట్టవచ్చును. రాజులకు చారులే చక్షువులు కదా! వారిద్వారా తీర్థములను కనుగొనవలెను.

మేఘ:— తీర్థములనగా నేవి? అవియెన్ని? వానిని కనిపెట్టు చారు లెట్లుండువలెను?

స్థిర:— శత్రుపక్షమునందు పదునెనిమిది, స్వపక్షమునందు పదునైదు తీర్థములు కలవని పూర్వము నారదుడు యుధిష్ఠిరునకు చెప్పెను. శత్రుపక్షమునందు ముగ్గురిని, స్వపక్షమునందు ముగ్గురిని గుప్తచారులను నియోగించి తీర్థములను కనిపెట్టవలెను. వారి ద్వారా స్వపక్షపరపక్షములను వశ్యముచేసికొన

వచ్చును. 'తీర్థ' మనగా శత్రువును జయించుటకు అనువైన ఉపాయమును తెలియుట. అట్లుతెలిసికొను చారునికర్మ కుత్సితము-కపటమైనచో అది ప్రభువు యొక్క వినాశమునకు కారణమగును. అది మంచి దైనచో ప్రభువుయొక్క అభివృద్ధికి హేతువగును. తీర్థములేవనగా:—మంత్రి, పురోహితుడు, సేనాపతి, యువరాజు, ద్వారపాలకుడు, అంతఃపురాధ్యక్షుడు, ఉన్నతన్యాయాధికారి, ప్రభుత్వధనమును సేకరించు కరగ్రాహివంటివాడు, సలహాలను ఇచ్చువాడు, వార్తను మరియొకచోటికి తీసికొని పోవువాడు, సైన్యప్రయాణ సౌకర్యములను కల్పించువాడు, గజ పాలకుడు, కోశాధ్యక్షుడు (ఖజానాదారు), దుర్గరక్ష కుడు, పన్నులను సరిగా సేకరించువాడు సరిహద్దుల రక్షకుడు—ఈ మొదలైనవారు రాజ్యరక్షణము నందు ప్రధానులు. వీరు 'తీర్థములు' అనబడుదురు. వీరిలో చీలికలు కలిగించి పరస్పరము భేద భావము కలిగించనచో త్వరగా శత్రువును వశపరచుకొన వచ్చును ఇవి శత్రుపక్షములోనితీర్థములు.

ఇక స్వపక్షతీర్థము లేవనగా:—రాణి, రాజమాత, అంతః పురసేవకుడు (కంచుకి), పుష్పమాలలు చేయువాడు, రాత్రి వేళలలో శయ్యలను రక్షించువాడు, సుగంధ ద్రవ్యముల రక్ష కుడు, గుప్తచారుల అధ్యక్షుడు, వైద్యుడు జ్యోతిష్కుడు, పాము లను పట్టుకొని ఆడించువాడు, పిచ్చివాడు, నీరుమోయువాడు, తాంబూలపు పెట్టెను మోయువాడు, ఆచార్యుడు (గురువు), అంగరక్షకుడు, స్థానముయొక్క మంచి చెడుగులను కనిపెట్టు చుండువాడు, గొడుగుపట్టువాడు, వేశ్యస్త్రీ—ఈ మొదలైనవారితో విరోధముచేసినచో స్వపక్షమునకు హాని సంభవించును. అదివిని మేఘవర్ణుడు, 'కాకులకు, గుడ్లగూబలకు ప్రాణాంతకమైన విరో ధము ఎందుకు వచ్చినది!' అని స్థిరజీవిని అడిగెను. ఆమాటకు స్థిరజీవి యీ కథ చెప్పదొడగెను:—

"పూర్వమొకప్పుడు పక్షులన్నియు కలిసి ఒక సభచేసెను. అవి మిక్కిలి దుఃఖించుచు ఈవిధముగా చింతింపసాగెను":—

"మనకు గరుత్మంతుడు రాజు. ఆయన విష్ణుభక్తుడు. మనను గూర్చిన చింతయే ఆయన పట్టించుకొనడు. అట్టివ్యర్థుడైన ప్రభువు వలన మనకేమి ప్రయోజనము? ప్రతిదినము కిరాతుల వలలలో చిక్కుకొనుచున్నమనను ఆయన రక్షింపడు. కనుక మనమందరము యోచించి ఆయనను విడిచి మరియొకనిని రాజుగా ఎన్నుకొందుము! అని చెప్పి వారిలో అందగాడైన గుడ్లగూబను చూచి అందరును ఒక్కమాటగా, 'గుడ్లగూబయే మనకు రాజుగా నుండగలదు కనుక పట్టాభిషేకమునకు సామగ్రిని తెండు' అని చెప్పెను అమాట ప్రకారమే పట్టాభిషేక సంభారము లన్నియుకూర్చ బడి భార్యతోపాటు గుడ్లగూబను రాజ్యసింహాసనందు అభిషేకము చేయుటకు అరంభించుచుండిరి. ఇంతలో ఎక్కడినుండియో యొక కాకివచ్చి, 'పక్షులన్నియు ఇక్కడ ఎందుకు చేరియుండ వచ్చును.' అని చింతించెను. 'పక్షులలో కాకి బుద్ధిశాలిగనుక అతనితో యోచింతము.' అని ఆ పక్షులందరు నిశ్చయించుకొనిరి. అప్పుడు కాకిని అడిగిరి.

కాకి:— ఏల యీ సమారోహమును చేయుచున్నారు?

పక్షులు:—పక్షులకు రాజులేడని యీగుడ్లగూబను పక్షిరాజ్యమునకు అధిపతినిగా చేయుచున్నాము. నీయభిప్రాయమును గూడ తెలుపుము.

కాకి:— (నవ్వుచు) హంస మొదలగు ఉత్తమ పక్షులు ఎన్నియో యుండగా పగలు గ్రుడ్డిదైన గుడ్లగూబను రాజుగా చేయుట యుక్తముగాదు. ఇంతియేకాక, మనకు గరుత్మం తుడు రాజుగానుండగా ఈదివాంధ పక్షియేల? ఇంకొ కవేళ గుణవంతుడైనను, ఒకడు పూర్వమే నిర్ణీతుడై యుండగా మరియొక రాజును నిర్ణయించుట తగదు. 'గరుడు మనకు రాజు,' అని వినినంతమాత్రముననే శత్రువులందరు బెదరిపోవుదురుగదా! పెద్దవారి సంబంధము ఉన్నంత మాత్రమున మనకార్యములన్నియు సిద్ధించును. శశి(చంద్రుని) సంబంధముచేత శశములకు (కుందేళ్లకు) సుఖములభించుటలేదా! అలాగే మనముగూడ గరుడ సంబంధముచేత సమస్త సుఖములను అనుభవించవచ్చును. ఈ విషయములో ఒక కథచెప్పెదను వినుడు. అని ఆ కథయిట్లు చెప్పదొడగెను:—

"ఒకానొక వనమునందు 'చతుర్దంతము' అనునొక మహాగజము తనపరివారముతో నివసించుచుండెను. ఆవనమునందు ఒకప్పుడు గొప్ప అనావృష్టి అనేక సంవత్సరముల వరకు ఏర్పడెను. ఆ కరవుచేత జలాశయము లన్నియు ఎండిపోయెను. అప్పుడు ఏనుగు లన్నియు తమ రాజుతో 'దేవా! ఏనుగు గున్నలు దప్పిగొని మృత ప్రాయములై పడియున్నవి. గజములు కొన్ని చచ్చినవి, జలము సమృద్ధిగా లభించు చోటును వెదక వలెను. అని చెప్పెను. ఆమాటకు చతుర్దంతుడు చాల సేపు చింతించి యిట్లనెను, 'ఒక విజన ప్రదేశమునందు పాతాళ గంగతో పరి పూర్ణమైన యొక పెద్ద కొలను ఉన్నది అక్కడికి అందరు పొండు.' అని చెప్పెను. ఆమాట విని గజములన్నియు అయిదు దినములు ప్రయాణము చేసి ఆకొలను చేరి అందులో స్వేచ్ఛగా స్నానము చేసి సాయంకాలమునకు వెలుపలికి వచ్చెను. ఆకొలను చుట్టు కుందేళ్ళ బిలములు అనేకములు ఉండెను. ఆబిలము లన్నిటిని అచ్చట తిరుగుచున్న గజములు భగ్నము చేసెను. కుందేళ్ల కొన్ని కాళ్లు శిరస్సులు విరిగి పడిపోయెను కొన్ని మరణించెను. గజములచ్చట నుండి తిరిగిపోయిన తరు వాత కుందేళ్లు దుఃఖించి ఒకచోచేరి పరస్పరము యీ విధముగ ఆలోచించెను. వేరు చోట జలము లేనందు వలన యీయేనుగులు ప్రతి దిన మిక్కడకు వచ్చి మనకు నాశము కలిగించు చున్నవి దీనికేదైన యుపాయము మనము యోచించ వలెను," ఒక కుందేలు యిట్లనెను!" మనకిక్కడ ఆపద వచ్చినది గనుక యీ దేశమును విడచి పోవుదము. మనకు గత్యంతరము లేదు." అదివిని యితర శశకములు యిట్లు చెప్పెను:" ఓయీ! మనము తంత్రి

తాతల కాలము నుండి యిచ్చట ఉన్నాము యీ స్థానమును విడువలేము. కాబట్టి మనము యిక్కడనే ఉండి ఏనుగులు యీ ప్రాంతమునకు రాకుండ ఉండుటకు వాటికి భయోత్పాతమును కలిగించు ఉపాయము కనిపెట్టవలెను." అమాట విని మరి కొన్ని కుందేళ్లు యిట్లనెను:" అగజము ఇక్కడకు రాకుండ వాటికి బెదరు కలిగించుటకు ఒక మంచి ఉపాయమున్నది. మనము ఒక దూతను గజయూథము వద్దకు పంపవలెను. అతని వెంట ఒక వార్త చెప్పి పంపవలెను. అది ఏమనగా. మాప్రభువు విజయదత్తుడను కుందేలు చంద్రమండలములో నివసించు చున్నాడు. చంద్రుడు తన సేవకులైన కుందేళ్లను మీరునశింపజేయుచున్నందు వలన యిక పైన అకొలని వద్దకు మీరు రాకూడదని నిషేధించుచున్నాడు, అని చెప్పినచో చంద్రాజ్ఞకు భయపడి గజములు మన వద్దకు రాక పోవచ్చును. అమాట విని యిది మంచి ఉపాయమని కుందేళ్లన్నియు అంగీకరించి దూతకర్మ చేయుటలో మంచి చాతుర్యము గల లంబకర్ణుని మనము పంపుదము. అతడీపని నెరవేర్చుకొని రాగలడని నిశ్చయించుకొనెను. అన్ని కుందేళ్లు అంగీకరించి లంబకర్ణని గజయూథము కడకు పంపెను. అతడక్కడకుపోయి ఓదుష్ట గజమా! మీ పరివార మికపైన కుందేళ్లకు నివాసమైన చంద్రసరస్సుకు రాకూడదు. ఇది చంద్రుని యాజ్ఞ. అని చెప్పెను, అమాటవిని ఆశ్చర్యపడి గజము 'నీ వెవడవు?''అనెను నేను చంద్రమండలమున నివసించు లంబకర్ణడను కుందేటి రాజును నాప్రభువు చంద్రుడుదూతగా నన్ను మీకడకు పంపెను.'' ''చంద్రుని సందేశమేమి?'' యని గజమడిగెను. ''నిన్న మీరు కొలనికిపోయి మా సేవకులయిన కుందేళ్లను చంపితిరి. మీకు ప్రాణములపై ఆశయున్నచో నికమీద ఎప్పుడుకూడ ఆకొలనికి పోవకుడు" అని చంద్రుని యాజ్ఞ అని లంబకర్ణడు చెప్పెను. అమాటకు గజము ''యిప్పుడు ప్రభువు చంద్రుడెక్కడనున్నాడు?'' అని యడిగెను శశకము ''మీ యూనాథముచేత గాయపరచబడిన కుందేళ్ల క్షేమమును తెలిసికొనుటకు చంద్రుడు కొలని కడకే వచ్చినాడు. నన్ను మీకడకు యీ సందేశము చెప్పిపంపినాడు'' అని చెప్పెను. అది విని గజము ''అట్లయినచో మీ ప్రభువు దర్శనము నాకుచేయింపుము. నేను నమస్కరించి వచ్చెదను'' అనెను. అది విని శశకము'' నా వెంట ఒంటరిగారమ్ము మా ప్రభువును చూపెదను ' అని చెప్పి రాత్రివేళ ఆ గజమును కొలని గట్టుకు తీసుకునిపోయి జలములో ప్రతిబింబించిన చంద్రునిచూపి యిట్లనెను. మాప్రభువు జలమధ్యములో సమాధిలో ఉన్నాడు. సద్దుచేయక దూరమునుండియే నమస్కరించిపొమ్ము ఆయన సమాధిభంగమైనచో కోపించి మిమ్ము నశింపజేయును.'' అని చెప్పెను. గజ మా మాటవిని భయపడి దూరమునుండియే చంద్రునికి నమస్కరించి వెడలిపోయెను. కుందేళ్ళు ఆనాటినుండి సపరివారముగా సుఖముగా తమ స్థానములలో నివశించుచుండెను.

అని యీ కథచెప్పి కాకి పెద్దల సాంగత్యముచేత తప్పక క్షేమము కలుగును అనిపై కథవలన మీరు తెలుసుకొంటిరి. కనుక క్షుద్రుడైన గుడ్లగూబను మనకు ప్రభువుగా చేసుకొనకూడదు. పూర్వము భిక్షుద్రుడైన రాజును కొలిచి ఒక కుందేలు, ఒక కపింజలము అనుపక్షి రెండును మరణించెనని కథ చెప్పదొడగెను.

( సశేషము )

# టోకియో లేఖలు

అట్లూరి వెంకటేశ్వరరావు



*[శ్రీ అట్లూరి వెంకటేశ్వరరావు ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తిశాఖలో డివిజనల్ ఇంజనీరుగా పని చేస్తున్నారు. శ్రీ వెంకటేశ్వరరావు అప్రోసస్టం ప్రిస్ట్రెస్డ్ కాంక్రీట్ అనే ఒక క్రొత్తరకం కాంక్రీటు మిశ్రమాన్ని కనుగొని, యీ ఏడాది రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో కేంద్ర పరిశ్రమలశాఖ అవార్డును పొందారు. వీరిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1963-64లో తొమ్మిది నెలలపాటు ఉన్నత సాంకేతిక శిక్షణ నిమిత్తం జపానుదేశానికి పంపించింది. జపానులో వుండగా ఆదేశంలో వివిధ రంగాలలోని పరిస్థితులను గూర్చి పిల్లలకు విజ్ఞాన వికాసాలను కలిగించేవిధంగా వారి కుమారులకు వ్రాశారు. వీరి వుత్తరాలు బాలబాలికలకు అత్యంత ప్రయోజనకరంగా, ఆసక్తికరంగా వుండి చిన్నారి మనసుల్లో క్రొంగ్రొత్త విజ్ఞాన లోకాలను తెరుస్తాయనడంలో ఎట్టిసందేహమూలేదు. వీరి లేఖలను "ఆంధ్రప్రదేశ్" లో ధారావాహికంగా ఈ నెలనుంచి ప్రచురిస్తున్నాము.*

*—సం.]*

## విమాన ప్రయాణం

చిరంజీవులయిన పెద్దబాబు చిన్నబాబులకు మీనాన్న దీవించి వ్రాయునదీ ఏమనగా—

మన వాళ్లందరివద్ద శెలవుతీసికొని మన ఊరినుండి బయల్దేరిన పిదప హైదరాబాదు వచ్చాను. ఈ నెల ఒకటవ తేదీన హైదరాబాదు నుండి విమానంలో బయలుదేరి రెండవ తారీఖు రాత్రి టోకియో మహాపట్టణంలో అడుగు పెట్టాను. ఈ విమాన ప్రయాణాన్ని గూర్చి విపులంగా ఈలేఖలో వివరిస్తాను.

ఇక్కడి విమానాశ్రయంలో—ప్రతిరోజు ఢిల్లీనుండి మదరాసుకు ఒక విమానం ప్రయాణం చేస్తుంటుంది. ఆ విమానం హైదరాబాదులో ఆగి మదరాసు వెళ్లే ప్రయాణీకులను తీసికొని వెళ్తుంది. ఆ విమానము రావడానికి ఒక గంటముందుగానే ప్రయాణీకులందరు విమానాశ్రియం చేరుకొంటారు. విమానాశ్రియంలో ప్రయాణీకుల సామాను లన్నింటిని తూకం వేస్తారు. టిక్కెట్లను పరిచూసిన తరువాత విమానం లోపలికి ప్రవేశించడానికి అనుమతి పత్రాలను ఇస్తారు. ఈ పత్రాలను పొందినతరువాత విమానంబయలుదేరేవరకు విమానాశ్రయంలో వేచి ఉండవలెను. విమాన కంపెనీతాలూకు కూలీలు నా సామానులన్నిటిని విమానం రాగానే దాని లోపలికి ఎక్కించారు. విమానంబయలుదేరడానికి ఐదు నిముషాలముందు ప్రయాణీకులను విమానం లోనికి రమ్మని పిలిచారు. అక్కడ ఉన్న బంధుమిత్రుల నుండి వీడ్కోలు పొందిన పిదప విమానములోకి వెళ్లి అందులో నాకు నిర్ణయించిన సీటులో కూర్చున్నాను.

విమానంలోని విశేషాలు—ఈ విమానంలో 44 సీట్లే ఉన్నవి. ఈ విమానాన్ని నడిపేవారు నలుగురు. విమానంలోని ప్రయాణీకుల సౌకర్యాలను చూడడానికి వారికి కావలసిన సహాయము చేయుటకు ఇద్దరు స్త్రీలు కూడ ఉండిరి. వీరిని ఎయిర్ హోస్టస్‌లు అందురు. విమానము బయలుదేరుటకు ముందు ఒక ఎయిర్ హోస్టస్ ప్రయాణీకులందరికి, ప్రమాదము జరిగిన యెడల అనుసరించదగు విధులనుగూర్చి ప్రయాణములో తీసికొనవలసిన జాగ్రత్తలను గూర్చి విపులంగా వివరించి చెప్పింది. విమానం బయలుదేరేముందు ప్రతి ప్రయాణీకుడు తన సీటులోని బెల్టును గట్టిగా బిగించుకొనవలెను. చెవులలో దూది పెట్టుకొనవలెను. సీటుబెల్టు బిగించని యెడల విమానము ఎగురునప్పుడు అటూ ఇటూ పడే అవకాశం వున్నది. చెవులలో దూదిపెట్టుకోకపోతే గాలి పీడనశక్తిలోని వ్యత్యాసం వలన చెవులలో నొప్పి వచ్చే ప్రమాదం ఉంది. విమానం పైకి వెళ్లిన పిదప బెల్టును తీసివేయవచ్చును. అట్లే చెవిలో దూదిని కూడ తీసివేయ వచ్చును. ఈ రెండు ముందుజాగ్రత్తలు విమానము పైకి వెళ్లినప్పుడు క్రిందికి దిగునప్పుడు తప్పక తీసుకొనవలెను.

మా విమానము భూమినుండి ఐదువేల మీటరుల ఎత్తులో ప్రయాణం చేసింది. ఆ ఎత్తుచేరిన వెంటనే సీటు బెల్టును చేవులలో ఉన్న దూదిని తీసివేసితిని. అంత ఎత్తులో ప్రయాణము చేయునప్పుడు ధ్వని, గాలి మొదలయినవి లోపలికి రాకుండ విమానములో చాల ఏర్పాట్లు ఉన్నవి. విమానంలోపలి ప్రయాణీకులకు హాయిగా ఉండుటకు గాను విమానంలో చాల సౌకర్యాలున్నవి. విమానము పైకి వెళ్లిన కొద్దిసేపటికి ప్రయాణీకులందరికీ బిస్కట్లు, కాఫీ, తదితర పానీయాలు మొదలయిన పదార్థాలను ఎయిర్ హోస్టస్‌లు అందించారు. మా సీటవద్దనే టిఫిను కాఫీ తీసుకొనుటకు కావలసిన ఏర్పాట్లు ఉన్నవి. ఏ ప్రయాసలేకుండానే మనము భూమి మీద ఉన్నట్లుగానే ఫలహారాలను తీసికొన వచ్చును. సుమారు ఒకటిన్నర గంటలు ప్రయాణం చేసిన పిదప మా విమానము మదరాసులోని మీనంబాకం విమానాశ్రయంలో దిగింది. అక్కడినుండి వేరొక విమానములో కలకత్తాకు ప్రయాణము చేయవలెను. ఆ విమానము వచ్చేవరకు అక్కడే వేచి ఉన్నాను. నా సామానులన్నింటిని విమాన కంపెనితాలూకు కూలీలే హైదరాబాదునుంచి వచ్చిన విమానంలో నుండి దింపి, వేరొక విమానంలో ఎక్కించడానికి ఏర్పాట్లు చేశారు. కొంతసేపటికి మా విమానం వచ్చింది. ఆ విమానం కూడ హైదరాబాదు నుండి వచ్చిన విమానం వంటిదే. ఇందులోని ఏర్పాట్లు కూడ ఇంతకు ముందు ఉన్నట్లుగానే ఉన్నవి. సుమారు మూడున్నర గంటలు ప్రయాణం చేసిన పిదప మా విమానం మదరాసు నుండి కలకత్తా చేరుకొన్నది. కలకత్తా చేరునప్పటికి సాయంత్రం ఆరున్నర గంటలు అయింది.

<u>కలకత్తా కబుర్లు</u> — కలకత్తా విమానాశ్రయం పట్టణానికి సుమారు ఎనిమిది మైళ్లదూరంలో ఉన్నది. దానిపేరు డండం విమానాశ్రయం. అక్కడినుండి హోటలుకు వెళ్లడానికి విమాన కంపెనీ వారే ఏర్పాట్లు చేశారు. విమానంలోనుండి నా సామానులను తీసికొని కారులో, నాకు బస ఏర్పాటు చేసిన గ్రాండ్ హోటలు చేరుకున్నాను. గ్రాండ్ హోటలు కలకత్తాలో ఉన్న పెద్ద హోటళ్లలో ఒకటి. ఆ హోటల్లో రాత్రి బసచేసి రెండవలేది ఉదయం ఎనిమిది గంటలకు తిరిగి విమానాశ్రయం వెళ్లాను. అక్కడ విమాన కంపెనీతాలూకు సిబ్బంది నా సామానులు చూచి వాటికి కాగితాలు కట్టి కస్టమ్స్ ఆఫీసుకు పంపించారు కస్టమ్స్ ఆఫీసులో మన దేశపు ప్రయాణీకులు పట్టుకొని వెళ్లు సామానులన్నింటిని చూచి, అభ్యంతరకరమయినవి లేవని తెలిసిన పిదప సర్టిఫికెట్టు ఇస్తారు. కస్టమ్స్‌వారి తనిఖీ అయినతరువాత విమాన కంపెనీ తాలూకు సిబ్బంది నా సామానులను జపాను దేశం వెళ్లే విమానంలో ఎక్కించారు.

<u>మనవి రూపాయలు జపానువి ఎన్నులు</u> — మన దేశంలో వాడే డబ్బు విదేశాలలో చెల్లదు అందువలన నావద్ద ఉన్న డబ్బును విమానాశ్రయంలో ఉన్న బ్యాంకులో ఇచ్చి జపాను దేశములో వాడే డబ్బును అంటే ఎన్నులను తీసికొన్నాను డబ్బు మారకము అయిన పిదప పోలీసు డిపార్టుమెంటువారు నా పాస్‌పోర్టును తనిఖీ చేశారు. హిందూదేశం నుండి విదేశాలకు వెళ్లే ప్రయాణీకులందరు మన ప్రభుత్వపు అనుమతి పొందవలెను. ఆ అనుమతి పత్రమునే పాస్‌పోర్టు అందురు. ప్రతి ప్రయాణీకుని వద్ద, మశూచి, కలరా జబ్బులు రాకుండ ఇంజక్షనులు తీసికొన్నట్లు ఆధారము చూపు పత్రములుకూడ ఉండవలెను. అట్టి పత్రములు లేని యెడల విదేశ ప్రయాణాలను అనుమతించరు. ఈ రెండు పత్రములు కాక జపాను ప్రభుత్వమువారు, ఆ దేశమునకు వచ్చుటకు అనుమతించిన పత్రముకూడ ఉండవలెను ఈ పత్రమును వీసా అందురు. ఈ ఆధారాలన్నిటిని ఎంతోమంది ప్రభుత్వోద్యోగులు తనఖీ చేసిన పిదపనే నన్ను విమానం వద్దకు వెళ్ళనిచ్చారు.

## ఖ్యాతిగాంచిన కాంచనజంగ

సుమారు పదిగంటలకు, అమెరికా దేశంలోని న్యూయార్కు పట్టణంనుండి బయలుదేరి జపాను దేశంలోని టోకియో నగరానికి వెళ్ళే బోయింగ్ విమానం కలకత్తా చేరింది. ఈ విమానం పేరు కాంచన జంగ. ఈ విమానం ఇదివరకు మాస్కో నగరంనుండి బొంబాయివరకు ఎక్కడా ఆగకుండ ప్రయాణంచేసి ప్రఖ్యాతి పొందింది. ఇంతవరకు ఏ విమానం ప్రపంచములో ఇంత దూరము ఆగకుండ ప్రయాణము చేయలేదు. దీని సిబ్బందిలోని వారందరు చాల నేర్పుగలవారు. ఈ విమానంలో సుమారు 150 మందికి సీట్లు ఉన్నవి. విమాన కంపెనీ తాలూకు సిబ్బంది వారువచ్చి నా సామానులను విమానంలో ఎక్కించారు విమానం బయలుదేరడానికి పదిహేను నిమిషాలుముందు విమానం ఎక్కి, నాకు నిర్ణయించిన సీటులో కూర్చున్నాను.

ఇంతలో ఎయిర్ హోస్టస్‌లువచ్చి అందరు ప్రయాణీకులకు ప్రమాద సమయంలో తీసుకొనవలసిన చర్యలనుగూర్చి వివరించి చెప్పి, ప్రయాణానికి కావలసిన సౌకర్యాలన్నీ సమకూర్చారు. ఇంతకు పూర్వం ప్రయాణం చేసిన విమానము ఐదువేల మీటరుల ఎత్తులో ఎగురగా ఈ విమానము పదివేల మీటరుల ఎత్తులో



విమానంలో భోజనం చేస్తున్న ప్రయాణీకులు

ప్రయాణం చేసింది. అంత ఎత్తులో ఎగరడంవల్ల ఈ ప్రయాణం ఇదివరకటి ప్రయాణాలకంటె చాల హాయిగా ఉన్నది. సుమార

పన్నెండు గంటలకు ఎయిర్ హోస్టస్‌లు ప్రయాణీకులకు భోజనం ఏర్పాటు చేశారు. పెద్ద విందులో ఏర్పాటు చేసినన్ని పదార్థాలు వడ్డించారు. కూర్చున్నచోటనే భోజనం చేయడానికి వీలున్నది. ముందుపేజీలోని ఛాయాచిత్రంలో భోజనం చేస్తున్న ప్రయాణీకులను చూడవచ్చును. భూమిమీద ఉన్నప్పుడు భోజనం చేసినట్లుగానే పదివేల మీటరుల ఎత్తులోకూడ స్థిమితంగా భోజనం చేయవచ్చును. భోజనం పూర్తయ్యేలోపల బ్యాంకాంక్ చేరుకొన్నాం. బ్యాంకాంక్ థాయిలండ్ దేశానికి ముఖ్య పట్టణం. ఇక్కడ విమానం 30 నిమిషాలు ఆగి పెట్రోలు నింపుకొని తిరిగి ప్రయాణం కొనసాగించింది.

## మనకంటె మూడున్నర గంటలు ముందు

మా విమానం తూర్పు దిక్కుగా ప్రయాణం చేయడంవలన ప్రతి దేశంలోని టయిము మన టయిముకంటె ముందుగావుంటుంది. అందువల్ల జపాను దేశంలోని టయిము మనదేశపు టయిముకన్న మూడున్నర గంటలు ముందుగా ఉంటుంది. అనగా మన దేశంలో మధ్యాహ్నము ఒక గంట అయినప్పుడు జపాను దేశంలో సాయంత్రం నాలుగున్నర గంటలు అవుతుంది. అందువలన ప్రయాణీకులు తమ గడియారాలను ముందుకు త్రిప్పుకొనవలసి ఉంటుంది మన దేశం నుండి జపాను దేశానికి సుమారు పది గంటల ప్రయాణం. మన దేశంలో సుమారు మధ్యాహ్నం 11 గంటలకు బయలుదేరాం. అందుచేత మన టయిము ప్రకారం రాత్రి తొమ్మిది గంటలకు టోకియో చేరాం. కాని అప్పుడు వారి టయిము ప్రకారము రాత్రి పన్నెండున్నర గంటలు; అంటే 3 వ తారీఖున అక్కడ చేరామన్న మాట.

## టోకియో వచ్చింది

బ్యాంకాంక్ నుండి బయలుదేరిన విమానం హాంకాంగ్‌లో ఆగింది. అక్కడ తిరిగి పెట్రోలు నింపుకొన్న తరువాత ప్రయాణం సాగించింది. ఇప్పటికే రాత్రి అయింది. చీకటిలో ప్రయాణం ఎంతో వింతగా ఉంటుంది. రాత్రి జపాను టయిము ప్రకారము ఎనిమిదిన్నర గంటలకు భోజనం ఏర్పాటయింది. ప్రయాణీకులందరు భోజనాలు పూర్తిచేసి కూర్చున్న సీట్లలో నిద్రపోయారు. నేనుకూడ కొంచెంసేపు నిద్రపోయాను. ఇంతలో టోకియో వచ్చిందని విమాన కంపెనీ సిబ్బందివారు తెలియపర్చారు. క్రిందికిచూస్తే విద్యుద్దీపాలతో వెలుగుతున్న టోకియో ఒక పెద్ద కాంతి పుంజంవలె కనబడింది. విద్యుద్దీపాల అలంకారంతో టోకియో పట్టణం చుక్కల ఆకాశంవలె, దివ్వెల కదలివలె కనుపించింది. అదొక మరువరాని దృశ్యం. టోకియో విమానాశ్రయంలో మా విమానం దిగింది.

విమానాశ్రయానికి నా స్నేహితులు వచ్చారు. విమానం దిగగానే నన్నుచూసి దూరంనుండే వాళ్ళు సంతోషంతో కేకలు వేసారు. మిత్రుల్ని చూడగానే అంతులేని ఆనందం కల్గింది. అప్పుడే వాళ్ళు నాదగ్గరికి రాకూడదు. విమానాశ్రయపు నిబంధనలను అనుసరించి కలకత్తాలో జరిగిన తనిఖీలాంటి తనిఖీ పూర్తయ్యే వరకు బయటకు వెళ్ళకూడదు. నా సామానులను కస్టమ్స్‌వారు తనిఖీచేశారు. ఆరోగ్య సర్టిఫికేటులను ఆరోగ్య సిబ్బంది తనిఖీచేసింది. అన్ని తనిఖీలు పూర్తయిన తరవాత నా సామానులను తీసికొని బయటకు వచ్చి స్నేహితులను కల్సుకొన్నాను. మేమంతా కలిసి కారులో, నాకు బస ఏర్పాటుచేసిన హోటలు చేరుకున్నాము. ప్రయాణపు బడలికవలన వెంటనే ఉత్తరం వ్రాయలేకపోయాను. ఇక్కడి విశేషాలను తెలుపుతూ విపులంగా తరువాత ఉత్తరం వ్రాయగలను.

ఇట్లు,
మీ ప్రియమయిన
నాన్న






# దేశోద్ధారక, విశ్వదాత

## కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు

దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వర రావుగారు కృష్ణాజిల్లా ఎలకుర్రు గ్రామంలో జన్మించారు. స్వశక్తితో, స్వీయ ప్రతిభావ్యుత్పత్తులతో, తానుచేపట్టిన వాణిజ్య రంగంలో లక్షలు ఆర్జించి, ఆ ధనాన్ని ప్రజోపయోగ కార్యాలకు వెచ్చించారు. రెండోకంటికి తెలియకుండా దానధర్మాలు చేశారు. లెక్కకుమించి నాగేశ్వరరావుగారు చేసిన గుప్తదానాలే వారి వదాన్యతకు తార్కాణం. నాగేశ్వరరావుగారి వితరణ శీలానికీ, మాతృదేశాభిమానానికీమెచ్చి మహాత్మాగాంధీ ఆయనకు 'దేశోద్ధారక' అన్న బిరుదాన్ని ప్రసాదించారు. ఆంధ్రవిశ్వ విద్యాలయం నాగేశ్వరరావుగారి కళాభిరుచికీ, కళాపోషణకూ గుర్తింపుగా 'కళాప్రపూర్ణ' అన్న బిరుదునిచ్చి సత్కరించింది. వీరునెలకొల్పిన ఆంధ్ర పత్రిక ఆంధ్రదేశాన్ని చైతన్యమయం చేసింది. ఆంధ్రులు తమ గతకాలపు సంస్కృతీ విభవాన్ని పరిరక్షించుకోవడానికీ, సుందర భవిష్యత్తుకు రూపకల్పన చేసుకోవడానికీ వీరు నెలకొల్పిన పత్రికలు ఎంతగానో తోడ్పడ్డాయి. సాహితీ వేదికపై నిలిచి జాతిని జాగృతంచేసినఘనత వీరికి దక్కింది. అంతేగాదు ప్రౌఢమైన వచన రచనలో వీరు సిద్ధహస్తులు. గీతకు వీరుచేసినభాష్యం ఒక ఉత్కృష్టమైన రచనగా పేర్కొనవచ్చు. నాగేశ్వరరావుగారు గాంధీజీకి అచ్చమైన అనుయాయి. స్వాతంత్ర్య పోరాటంలో జాతిని నడిపించిన నాయకులలో ఒకరువీరు.

నాగేశ్వరావుగారికీ, ఆంధ్రోద్యమానికీ అవినాభావ సంబంధం వుంది. నాగేశ్వరరావుగారు లేందే ఆంధ్రోద్యమమేలేదు. స్వయంశక్తితో పైకివచ్చిన వ్యక్తి ఆయనే. ఆయన ఒక మహాసంస్థ. వారిలాంటి నాయకుల కృషివల్లనే ఆంధ్రులలో రాజకీయ, సాంస్కృతిక ఏకత్వం సాధించడానికి వీలయ్యింది. తెలుగుగడ్డలో ఆయన ఆశించిన ఆశయాలపంటపండి, ఫలితాల పళ్ళు కాపుకు వచ్చాయి. ఆయన ధన్యజీవి.

ఇంతకూ ఆపాత పల్లెటూరి పద్ధతిలో అమ్మ చేసిపెడితే తినడానికి అలవాటైనవారికి, గృహశాస్త్ర కళాశాలలో ఆధునిక పద్ధతులు నేర్చుకున్నవారివంట ఏమిరుచిస్తుందిలేండి. నిజంగా ఆహారపు అలవాట్లలో ఎంత వెనుకబడి, అజ్ఞానంలోవున్నారో మీరు! ఇన్ని సంవత్సరాలుగా మీ శ్రీమతిగారు మీకు ఆహార శాస్త్ర విషయాలు నూరిపోస్తున్నప్పటికీ ఏమీ అభివృద్ధి లేనేలేదు. ఉప్పు మీ ఒంటికి చాలామంచిదని మీకు యింతవరకు తెలియక పోయెగదా ' అని మీశ్రీమతి విచారం వెలిబుచ్చుతుంది. "అంతగా చెమటపోసే ఒంటికి రోజుకు మూడు సార్లైనా స్నానం అవసరం. మనిషిదగ్గర ఒకటేవాసన!" యిలా యిలా యింకెంత దూరమో సాగుతుంది......ఉప్పు ఎక్కువైందన్నందుకు చూశారా యిప్పుడు కారం ఎక్కువైంది. మల్లెపూలమూడ్‌పోయి మిరపకాయల ''మూడ్ ' వచ్చింది!

## గెలుపు మీదికాసు

ఇంకో ఉదాహరణ చెప్పివదిలేస్తాను. ఆదివారం ఒక మంచి సినిమాకు వెళ్దామని మీఅంతట మీరే సూచనచేస్తారు. కాదు '' పిక్‌నిక్ '' అని తీర్పుచెప్తుంది మీ శ్రీమతి. పాపం, మీరేంచెయ్యగలరు. తప్పదురా భగవంతుడా అని ఒప్పుకుంటారు సరే ఒక మంచి ఉద్యాన ప్రదేశానికి వెళ్తూవుంటారు. భోజన పదార్థాలు బైటికి తీస్తారు. వెంటనే సృష్టి అంతా మీ వెనకాలే అక్కడికి వచ్చినట్లనిపిస్తుంది. ఇద్దరో ముగ్గురో ముష్టివాండ్లు వచ్చి ఎదురుగ్గానుంచుంటారు. చుట్టుప్రక్కలకాకులన్నీ గుమికూడి సంగీతం పాడుతుంటాయి. అప్పుడే చీమలసైన్యం వచ్చి అన్నం మీద దాడి ప్రారంభిస్తుంది. సరే యీగల దండు అంతకుముందే వచ్చిదిగింది. అంతవరకూ, మీరు తన మాట విని ''పిక్‌నిక్''కు వచ్చారనే సంతృప్తితో మల్లెపూల 'మూడ్'లో వున్న మీశ్రీమతి యిప్పుడు హఠాత్తుగా మిరపకాయల 'మూడ్'లో ప్రవేశిస్తుంది. ఆమె చెప్పిన మాట వినినట్లేనటించి, మీరే యీ అసౌకర్యాలన్నీ కలిగించాలని-అంటే అటువంటి చోటికితెచ్చారని ఆమె మనస్సులో అనుకుంటుంది చరచరా పరుగెత్తి వెళ్లి కారులో ఎక్కి ''యిక చాల్లే వెళ్దాం రండి'' అని కేకేస్తుంది. ఇంటికి తిరిగి వెళ్లేటప్పుడు కారులోవుంటుంది మీపని. అసలు ''పిక్‌నిక్''కు అనుకూలమైనచోటు నిర్ణయించటమే మీకు చేతకాదు. మీరు ఆవిషయంలో పట్టి అసమర్థులు! పైగా ఏదో ద్రవ పదార్థంపడి చూడండి మీశ్రీమతి చీర ఎలాపాడైందో!! ఇక అన్నీ మీతప్పులే. అవతల మనిషి కారాలు మిరియాలునూరుతుంటే, మీకు కారాలు మిరియాలు నములుతున్నట్లుంది గదూ!

ఇలా, మెరుపు మెరిసినంతటిలో మల్లెల 'మూడ్,' కారాల 'మూడ్'గా మారిపోయే ఉదాహరణలు ఎన్నైనాచూపించవచ్చు. హత్యా నేరంమోపబడి జైలులోవున్న వాడికైనా నిర్దోషినని రుజువుచేసుకునే అవకాశంయిస్తారు, యిక్కడ అదేమీలేదు. నిన్నెందుకు శిక్షించకూడదు? అని అడగడమేలేదు. ఈ ''మూడ్' యింతహఠాత్తుగా, అప్రయత్నంగా ఎందుకు మారిందో మీరు కనుక్కోనేలేరు. ఎప్పుడూ మల్లెల 'మూడ్' నుంచి కారం 'మూడ్'కే మార్పు. ఈ ఒక వైపు ప్రయాణమే నా అనుభవం అటువైపునుంచి యిటువైపులేనేలేదు. మీయింట్లో ఏమైనావుంటే చెప్పండి.

[ఆంగ్లవ్యాసానికి కుందుర్తి తెలుగుసేత]



## గోదావరిపై రెండు కొత్త వంతెనలు

గోదావరి నదికి శాఖ అయిన వసిష్ఠకు అడ్డంగా తణుకు సమీపంలో సిద్ధాంతం వద్ద రూ. 96 లక్షల వ్యయంతో నిర్మించిన వంతెనకు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి ఏప్రిల్ 20 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. ఈ వంతెనకు స్వర్గీయ కళా వెంకటరావుగారి పేరు పెట్టారు. గోదావరి నది రెండు శాఖల మధ్య ప్రాంతమైన కోనసీమకు ఈ వంతెన వరప్రసాదం. 644 చదరపు మైళ్ళ విస్తీర్ణంగల ఈ ప్రాంతం జనాభా 7 లక్షలు. ఇక్కడి భూమి చాలా సారవంతమైనది. రెండు లక్షల ఎకరాలలో వరి పండిస్తారు. 50,000 ఎకరాల మేరలో కొబ్బరి తోటలున్నాయి. తమ ఉత్పత్తులను నది అవలి గట్టుకు సునాయాసంగా రవాణా చేయడానికి ఇచ్చటి ప్రజలకు ఈ వంతెన వల్ల ఇప్పుడు అవకాశం ఏర్పడింది. ఇంతవరకు పడవలు మాత్రమే ఇందుకు ఉపయోగిస్తుండేవి.

వసిష్ఠవంతెనకు–రెండు చివరలలోని స్తంభాలుకాక 21 ప్రధాన స్తంభాలున్నాయి. 200 టన్నుల హెచ్. టి. ఉక్కును, 350 టన్నుల సాధారణ ఉక్కును, 4600 టన్నుల సిమెంటును వంతెన నిర్మాణానికి వినియోగించారు.

వంతెన పనులకు 1960 జనవరి 4 వ తేదీన శంకుస్థాపన జరిగింది. 20–4–67 న ఆలమూరు సమీపంలో గోదావరీ నది మరోపాయ గౌతమీ నది పై నిర్మించబడిన వంతెనకు కూడా ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. దీనికి "కళావంతెన" గా నామకరణం చేశారు.

ఈ ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి శ్రీ జె. వి. నరసింగరావు ప్రసంగిస్తూ భారతదేశంలోని రోడ్డు వంతెనలలో యిది అతి పొడవైన రెండవ వంతెన కావడం మూలంగా, ముఖ్యమంత్రి ప్రారంభోత్సవంచేసిన యీ సంఘటన దేశంలోని వంతెనల నిర్మాణ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడుతుందని ఆయన వర్ణించారు.

రు1.8 కోట్ల ఖర్చుతో నిర్మించబడిన యీ వంతెనకు ఒక్కొక్కటి 160అడుగుల (మధ్యఎడం) చొప్పున 48కమానులు ఉన్నాయి. కొత్తపేట, రాజోలు, అమలాపురం నివాసులకు యిది చాలా ప్రయోజనకరమైనది. కీ.శే. కళావెంకట్రావు యీపథకానికి ప్రధానకారకులు.

గౌతమీవంతెన నిర్మాణానికి 682 టన్నుల హైటెన్సిల్ ఉక్కు, 450 టన్నుల మైల్డ్ ఉక్కు, 16500 టన్నుల సిమెంటు ఉపయోగించారు.



గౌతమి నదిపై వంతెన

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD.
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS- HYDERABAD-24

